# అ ప్పు లు

## చేయడం - తీర్చడం

ర చ న :

మునిమాణిక్యం నరసింహారావు

# 1. అప్పు అంటే....

మనకు ఏదో అవసరము కలిగినపుడు ఇరుగుపొరుగు వారి దగ్గర నుంచి గాని, గ్రామస్థుల దగ్గర నుంచి గాని, పొరుగూరి వారి దగ్గరనుంచి గాని, లేక ఒక బ్యాంకిలాంటి సంస్థలోగాని మళ్ళీ ఇస్తామనే భ్రమపెట్టి, తీసుకొనిన ధనమునకు గాని ధనేతరమునకు గాని అప్పు అని పేరు.

అప్పులు తీసుకొనే ఆచారము చాలా పురాతన మైన ఆచారము. ఎప్పటినుంచో ఈ ఆచారము మన దేశంలోనే కాక ఇతర దేశాలలో కూడా ఉన్నది.

షేక్స్పియరు నాటకాలలో ఈ అప్పుల వ్యవహారం కొంత కనిపిస్తుంది. మర్చెంటు ఆఫ్ వెన్నిసు అనే నాటకంలో యాంటోనియో అనేవర్తకుడు షైలాక్ అనే వడ్డీ వర్తకుని వద్ద ఒక పెద్ద మొత్తమును అప్పుగా పుచ్చుకొంటాడు. కథఅంతా ఆ విషయాన్ని ఆశ్రయించుకొని నడుస్తుంది. షేక్స్పియరు కాలంనాటికే అప్పులు పుచ్చుకొనడమూ, తీర్చడమూ అనే వ్యవహారము జరుగుతూ ఉండేది.

హరిశ్చంద్రుడు విశ్వామిత్రునికి యాగం చేయ డానికి డబ్బు ఇస్తాడు. ఆ మునిచంద్రుడు ఆ సొమ్మంతా మళ్ళీ ఆ మహారాజు చేతిలోనే పెట్టి "ఉంచు. కావలసి నప్పుడు వచ్చి తీసుకుపోతాను" అంటాడు.

ఆ తరువాత మరోసందర్భంలో ఆ హరిశ్చంద్రుడు ఆ మునీశ్వరునకే తన రాజ్యం అంతా ధారపోస్తాడు. రాజ్యం పుచ్చుకొని విశ్వామిత్రుడు ఆ దాచిపెట్టిన డబ్బు తెమ్మంటాడు. ఈ కథ అందరికీ తెలిసిందేకదా! ఆ కథఅంతా మనకు అక్కరలేదు. అందులో హరిశ్చం ద్రుడు విశ్వామిత్రునకు బాకీపడి అది తీర్చడానికి నానా అవస్థలు పడతాడు. ఇంతకూ మనకు కావలసిన విష యము ఏమిటీ అంటే, అప్పులు పుచ్చుకోవడమూ తీర్చడమూ అనే వ్యాపారము బహుపురాతనమైనదీ అని!

పురాణాలలోనుంచి ఇంకా ఎన్నో కథలు వివ రించి ఈ అప్పులు చేయడమూ తీర్చడమూ అనేది చాలా కాలంనుంచీ వస్తూఉన్న సాంఘిక వ్యాపారమని రూపించగలను. కాని అది అనవసరమని తలచి ఆ విషయం వదిలేస్తున్నాను.

## 2. అరుణం భాగ్యముచ్ఛత్

అప్పుచేసేవాడికి ఉండవలసిన మన స్తత్వము ఎట్టిది అన్న విషయం తీసుకుందాం. షేక్స్పి "నైదర్ ఎ బారోయర్ నార్ ఎ లెండర్ బీ"

(Neither a borrower nor a lender be) అన్నాడని, అప్పులు చేయడము మంచిది కాదని కొందరు అంటారు. అది సరియైన అభిప్రాయముకాదు. ప్రాజ్ఞుడు అనవలసిన మాటా కాదు!

అప్పులు చేయనివారు ఎవరైనా ఉన్నారా అని మొదట ప్రశ్న వేసుకోవాలి. ఎవరూ లేరు. అని జవాబు వస్తుంది. దానితో మనకు అప్పులు చేయడము అనే వ్యాపారము ఎడల ఆసక్తి పుట్టుకొస్తుంది. వేదంలో కూడా, "ఋణంకృత్వా" అని ఉన్నది.

పెద్దవాళ్లు అనగా ధనవంతులు పెద్ద మొత్తాలు అప్పుగా తెస్తారు. బక్క వాళ్లు చిన్న మొత్తాలు తెస్తారు. అంతే తేడా.

అప్పులు తేవటానికి మనకు అడ్డువచ్చే రెండో విషయము ఏమిటీ అంటే, ఇల్లాగ అప్పులు చేస్తున్నాము గదా ఇవి ఎల్లాగ తీర్చడమూ అని దిగులుపడడము.

అల్లాంటి భావాన్ని ఎప్పుడూ రానీయకూడదు. అప్పులు ఎల్లాగ తీరుస్తామా అనే దిగులు ఏమాత్రమూ పెట్టుకోకూడదు. ఆ దిగులు పెట్టుకుంటే అసలు అప్పులు చేయలేము. అందుకని అల్లాంటి భావముకాని, దానికి సన్నిహితమైన భావమును గాని ఏదీ రానీయకుండా అప్పులుచేసి పారెయ్యడమే ప్రాజ్ఞుడూ, దూరదృష్టి కలవాడూ, ముఖ్యంగా బ్రతక నేర్చిన వాడూ చేయు

వలసినపని. అల్లాంటి భావాలు మంచివి కావు కాబట్టి వాటికి "వ్యభిచారీ భావా"లని పేరు పెట్టారు మనవాళ్లు.

అప్పులు చేయడము తప్పు ఎప్పటికీ కాదు. మన ప్రభుత్వమే అప్పుజేస్తున్నది. దానికి "జాతీయ ఋణం" అని పేరు. అది కోట్లకు కోట్లకు పెరిగిపోయినా ప్రభుత్వం వారు ఏమాత్రం దిగులు పడరు. అల్లాంటప్పుడు ఏ నాలుగువేలో పదివేలో అప్పు ఉన్నదని దిగులు పడడము మన తెలివి తక్కువ తనమే కాని, మరొకటి కాదు.

అప్పు అనేది ఒక విధమైన ఆస్తి అని తెలిస్తే అప్పుడు అప్పు చేయడానికి ఇంకా ఎక్కువ ధైర్యం కలుగుతుంది.

ఇల్లు, పొలము, ఫ్యాక్టరీలలో షేర్లు మొదలైన అనేక రూపాలలో ఆస్తి ఉండవచ్చు. ఆస్తి ఉండదగిన రూపాలలో అప్పు ఒకటి.

ఒకడికి అప్పు పుట్టిందీ అంటే ఆ అప్పు వెనకాల ఆస్తి ఉన్నట్లే లెక్క.

ఆస్తి లేనివాడికి ఎవరూ అప్పియ్యరు. వాడి కేమండీ ! కాకిచేత కబురంపించి వేయో, రెండు వేలూ చేబదులుగా తెప్పించగలడు అని గొప్పగా చెపుతారు.

అప్పు అడగటానికి కొంతమంది ఎంతో సిగ్గు పడతారు. ఆ మానసిక దౌర్బల్యము ముందు పోగొట్టు

కోవాలె. సిగ్గూ భిడియమూ ఉంటే ఎవరూ బాగుపడరు. సిగ్గు అనేది పెట్టుకుంటే ఈ సినిమావాళ్ళు అంతా ఇల్లాగ అప్పులు చేయగలిగే వారేనా! ఛా,ఛా ఆ దుర్గుణం పోతేనేగాని మనం ప్రపంచంలో తల ఎత్తుకొని తిరగలేము.

ఇంకొక ముఖ్య విషయము ఏమిటీ అంటే అప్పు ఎల్లాగ తీరుస్తామూ అన్న వెధవ ఆలోచన ఎప్పుడూ రాకూడదు. ఎంత వద్దనుకొన్నా ఎంత నెట్టివేసినా అల్లాంటి ఆలోచన ఒకప్పుడు మనస్సులో ప్రవేశించి కొంచెం బాధ పెడుతూ ఉంటుంది. అది ఒక విధమైన జబ్బు. ఆ జబ్బు పోవడానికి కొన్ని ఆరోగ్య సూత్రాలు చెబుతాను. వీటి ప్రకారము నడుచుకొంటే క్రమేపి ఆ రోగం కుదిరి మనిషి ఆరోగ్యవంతుడు కాక తప్పదు.

అప్పులు పెరిగిపోతున్నవి, ఈ అప్పులు ఎట్లా తీరుతవి, అన్న ఆలోచన వస్తే భయం వేస్తుంది. ఒక్కొక్కప్పుడు గుండె గుబుక్కు మంటుంది. ఇదే ఈ భయంకరమైన వ్యాధికి ప్రారంభదశ అని గుర్తించ వలసి ఉన్నది.

ఈ జాడ్యం వచ్చిన తరవాత ప్రథమదశలో నాడి "లావుక" పిట్టవలె నడుస్తుందనీ, ఆ తరువాత పావురము వలెనూ, ఊరపిచ్చుక వలెనూ, లకుముకి పిట్ట

వలెనూ నడుస్తుందనీ "లోలంబ రాజీయంలో" చెప్పినాడు.

మొదటనే ఈ రోగానికి చికిత్స ప్రారంభం చేయక అశ్రద్ధ చేశామా అంటే అది తీవ్రమైన, సులభంగా నయము చేయడానికి వీలుకానిదై కూర్చుంటుంది. అన్నం సహించక పోవడమూ ఏమీ తోచకపోవడమూ ఏదో దిగులుగా ఉండడమూ మొదలైన దుర్గుణాలు క్రమంగా కనపడి చివరకు ఉన్మాదంలోకి దింపవచ్చు.

అందుకని మొదట్లోనే తగిన చికిత్స ప్రారంభించాలె. ఎట్లాగు అనేది ప్రశ్న. ఇది మనస్సుకు సంబంధించిన వ్యాధి కాబట్టి దీనిని మానసిక వ్యాపారంవల్లనే కుదర్చవలె.

లోపలనుంచి ఎవరికీ వినపడని గొంతుకతో ఎవరో చెబుతూ ఉంటారు. "నీకు అప్పులు ఎక్కువైపోతున్నవిరా అబ్బాయి జాగ్రత్త" అని.

ఆ విధంగా చెబుతూ ఉంటే ఆ కనపడని మనిషికి నీవు ఎప్పటికప్పుడు ఏవో తగిన సమాధానాలు చెపుతూ నోరు మూయించవలె

ఆ ప్రశ్నలు ఎల్లాగ ఉంటవో సమాధానాలు ఎల్లాగ ఉండవలయునో తెలిసేందుకు ఈ క్రింద అల్లాంటి సంభాషణ ఒకటి ఇచ్చినాను.

అప్పుడు అంతరాత్మ కాస్త తగ్గి "వద్దురా బాబూ ఊరుకో. ఇబ్బందులలో పడతావు!" అని చెపుతుంది.

"పడితే పడ్డాను. ప్రస్తుతం ఉన్న ఇబ్బందులు గడిస్తే తరువాత వచ్చే ఇబ్బందుల సంగతి ఆలోచించు కోవచ్చు. అయినా నీవు ఇటువంటి మాటలు చెప్పకు. నా అప్పులు ఎట్లా తీరుస్తానో నీకు అసలు చెప్పను. అంతగా తీర్చలేకపోతే ఎగగొడతాను"

"అప్రతిష్టరా బాబూ!" అంటుంది అంతరాత్మ.

"ఆఁ ఏమీలేదు. ఎంతమంది దినాలా తీయ డములేదు. అందులో నేనొకడిని అవుతాను".

"వద్దు నా మాట విను" అంటుంది మళ్ళీ.

"నీ మాటలు వినను. నీ మాటలు విని బాగు పడ్డది ఎవరూలేరు. నీవు నోరుమూసుకో నా ఇష్టం వచ్చి నట్లు అప్పులుచేసి దర్జాగా హాయిగా సుఖంగా జీవిస్తాను. ఆ అప్పులు తీర్చే విధానం దేవుడే చూపిస్తాడు. నాటు పోసినవాడు నీరు పోయక మానాడా?"

"వద్దు"

"నోరు ముయ్"

ఈ విధంగా అంతరాత్మచెప్పే మాటలకు ఎప్పటి కప్పుడు తగిన సమాధానం చెపుతూ ఉండవలె. ఆ చెప్ప

జము గట్టిగా చెప్పవలె. ఏడ్చావులే నోరు మూసుకో అన్న ధోరణిలో చెప్పుకుపోవాలె. ఇల్లాగ చెప్పగా పోగాపోగా ఆ అంతరాత్మ అనేది చచ్చి ఊరుకోంటుంది.

సిగ్గును విడిచివేయడమూ, అంతరాత్మను చంపి వేయడమూ అనే ఈ రెండు పనులు జరిగేటప్పటికి మనుష్యునికి అప్పులు చేయడానికి కావలసిన ఉత్సాహము, మానసిక దారుఢ్యమూ వస్తవి.

ఒకవేళ మనస్సు ఇంకా పీకుతున్నట్లయితే ఇంకొక పని చేయవలసి ఉంటుంది. అది ఏమిటీ అంటే నీలో ఉండే సృజనశక్తిని మేల్కొలుపవలె.

అది ఎట్లాగూ అంటే నీకు నీవే ధైర్యం చెప్పుకోవాలె. నీలో ఉండే మహత్తరమైన ఈ శక్తికి చైతన్యం కలగాలంటే ఈ క్రింది విధంగా చెప్పుకోవాలె. గట్టిగా మనస్సునకు నాటేలాగున చెప్పుకోవాలె.

"అప్పులు చేస్తున్నానూ ! ఏమి చేస్తే ? ఎందరు చేయడములేదు ! నేనూ చేస్తాను."

తీర్చడము ఎల్లాగు అనేదేగా ప్రశ్న ! మరేమీ ఫరవాలేదు. తీర్చేశక్తి భగవంతుడే ఇస్తాడు.

ఆ రామదాసు అప్పులు ఎవరు తీర్చారు ? చచ్చినట్లు వాళ్లే తీర్చుకున్నారు. ఆ రామలక్ష్మణులు బంట్రోతుల వేషంలో మరీ వచ్చి అణాపైసలతో అప్పంతా తీర్చినారా లేదా !

"అయితే రామదాసు భక్తుడు, నీవేం భక్తుడివి? అంటావు. అంతేగదూ నీవు అనడము!"

"నేనూభక్తుణ్ని ఎందుకు కాదూ? నేనూ భక్తుణ్ని! ఇదివరలో ఏమోగాని ఇప్పుడు మంచి భక్తుణ్ణిఅయినాను. నా అప్పులన్నీ భగవంతుడే తీరుస్తాడు అని నమ్మకం కుదిరినదగ్గరినుండీ నాకు భక్తి ఎక్కువఅవుతున్నది."

భగవద్గీతలో కూడా ఈ చేసేపనియొక్క ఫలితం ఏమిటీ అని ఎప్పుడూ ఆలోచించకూడదు అన్నాడు!

అప్పులు చేయడముకూడా ఒక పనే కాబట్టి, ఆ పనియొక్క ఫలితాన్ని గూర్చి మనము ఆలోచించ కూడదు. చేసేసి కృష్ణార్పణం అంటిమూమిగతా వ్యవహారం అంతా ఆ కృష్ణపరమాత్ముడే చూచుకొంటాడు. కాబట్టి భగవంతునిమీద భారంవేసి మన పని మనము చేసుకుపోవడమే కర్తవ్యము

నేను ఏమైనా దొంగతనం చేస్తున్నానా, ఒకరి కొంప కూలుస్తున్నానా? అటువంటిది ఏమీ లేదే! నేనెందుకూ భయపడడము!

కొంప గడవక, వచ్చిన సంపాదన చాలక ఈ జీవితము ఏదో కాస్త ఆనందంగా గడవటానికి అప్పులు చేస్తున్నాను. ఇది తప్పు ఏమాత్రమూ కానేరదు.

ఋడిపోటులు చేసేవాళ్ళు చేస్తున్నారు! ఇతరు[illegible]సించి ధనం ఆర్జించేవాళ్లు ఆర్జిస్తున్నారు!

చీకటి బజార్లలో వస్తువులు అమ్మి మేడలు కట్టించేవాళ్ళు
కట్టిస్తూనే ఉన్నారు! అవన్నీ బాగున్నవి! భగవంతుడు
హర్షిస్తున్నాడు! ఎటొచ్చీ నేను అప్పులు చేయడము
తప్పు అయిందా? చాలుగాని ఇక ఊరుకో. ఇటువంటి
ఆలోచనలు పెట్టుకొని జీవితము పాడు జేసుకోకురా
అబ్బాయి."

ఈ విధంగా అనేక విధాలుగా నీకు నీవు ధైర్యం
చెప్పుకోవాలె. నీవు అప్పులు చేయడము అవసరమనీ,
అందులో తప్పు ఏమాత్రిమూ లేదనీ, అనేకమైన కార
ణాలు చూపి నీ మనస్సును దిట్టపరచుకో. ఇంకా
ఇల్లాగ అనుకో:

"అప్పులు తీర్చలేనే అనుకొందాము. తీర్చలేక
పోతేనాదు ఫుట్టి మునిగింది. ఇంకొకరి దగ్గర ఉండవలసిన
సొమ్ము నా దగ్గర ఉన్నది. ఉంటే ఏమి?

మద్ది సుదర్శనంగారి దగ్గర ఉండవలసిన సొమ్ము,
మద్దాలి శేషగిరిరావుగారి దగ్గర ఉంటే జాతికి వచ్చిన
నష్టం ఏమిటి? దేశానికి వచ్చిన నష్టం ఏమిటి?

అల్లాగ చేస్తే చట్టవిరుద్ధమనీ, ప్రభుత్వం ఊరుకోదనీ
అంటావు. ఆ మాట నిజమే! అయితే అది వేరేసంగతి.

నైతికదృష్ట్యా ఈ కార్యము తప్పులేదు అని
నేను అంటున్నాను. ఈ విషయంలో నేను చేసిన పనికి
భగవంతునికి ఏమీ కోపంరాదు.

ప్రభుత్వానికి కోపం వస్తుందనీ, అల్లాగ అప్పులు చేసి ఎగగొట్టినవారిని ప్రభుత్వం శిక్షిస్తుందనీ అంటే, ఆ మాట నేను కాదనను. ప్రభుత్వానికి చిక్కకుండానూ, శిక్ష పడకుండానూ నేను చూచుకొంటాను.

అయితే ఇల్లాగ అప్పులుచేసి వాటిని తీర్చక పోవడము సంఘానికి ద్రోహము చెయ్యడము అని ఎవరైనా అంటే అనవచ్చు. ఇది సాంఘిక క్షేమానికి విరుద్ధము ఏమాత్రమూ కాదని నేను గట్టిగా చెప్పగలను. ఎందుకూ అంటే ఆ భాగ్యవంతుడు ధనాన్ని సద్వినియోగం చేయక ఊరికే దాచిపెట్టి ఉంచుతున్నాడు నేను దానిని సద్వినియోగం చేస్తున్నాను. ఆర్థికశాస్త్ర వేత్త ఎవ్వరైనాసరే నేను చేసినదే మంచిదని అంగీకరించక మానడు.

ఆర్థికశాస్త్రవేత్త అంటే ఎవరూ అని ప్రశ్న వస్తుంది. ఎవరైతే తాను దరిద్రంలో ఉండీ, ఇతరులకు డబ్బు చేసుకొనే ఉపాయాలు చెబుతూ ఉంటాడో అతడేనిజమైన ఆర్థికశాస్త్రవేత్త. ఆ విషయం వదిలేద్దాం.

ఇంతకూ ధనము సద్వినియోగం కావడము మంచిదీ అంటున్నాను. కొండలపై పడ్డ వర్షము పంట భూములకు చేరినప్పుడే అది సద్వినియోగమైనట్లు! కృపణుడైన వాని దగ్గర చేరిన ధనం సద్గృహస్థు వద్దకు చేరినప్పుడే భగవంతుడు సంతోషిస్తాడు.

"ఎందుకొచ్చిన తర్జనభర్జన - ఇది. 'మనసా వద్దిక నాదు మాట వినుమూ, మర్యాద కాపాడుమూ, – అట్టే వాదించక పడిఉండు. నీకూ మంచిది–నాకూ మంచిది.

పైన వివరించిన తెలుంగున అనేకవిధాలుగా ఆత్మ బోధన చేసుకొనడము వలన మనిషి తన శక్తిలో తాను నమ్మకము కలవాడై ఎంత కష్టసాధ్యమైన పనిని అయినా చేయడానికి సమర్థుడు అవుతాడు.

ఇంతకూ సంశయనివృత్తి కావాలి. నీవు చేయదలచుకొన్న కార్యమునందు నీకుపూర్తి అయిన నమ్మకం కుదరవలె. సంశయాత్ముడు ఏ పనీ చేయలేనివాడై వినాశం పొందుతాడు.

పైన సూచించిన విధముగానూ, ఇంకా అనేక రీతులుగానూ మనస్సును బలపరచవలసి ఉన్నది.

ఆ తరువాత సంశయము లేనట్టి మనస్సుతో, విశ్వాసంతో, ఉత్సాహంతో అప్పులు చేయటం అనే కార్యక్రమములోనికి దిగవలెను.

ఇంతవరకు వివరింపబడిన కార్యక్రమమువలన అప్పులు చేయడానికి కావలసిన మనోదార్ఢ్యము మాత్రము లభిస్తుంది. అంతమాత్రముచేత నీకు తెలియవలసింది అంతా తెలిసింది అనుకొని ఎవరినైనా అప్పు అడిగావా దెబ్బతింటావు. అప్పుకొఱకై బయలుదేరే ముందు చేయువలసిన కృషి చాలా ఉన్నది. ఆవిషయమై తరువాత ప్రకరణములో చెప్పబడును.

## 3. కృషి

ఏదైనా ఒక పని ఫలించవలయునూ అంటే కొంత కృషి అవసరము. కృషిలేకుండా ఏవ్యవసాయమూ ఫలోన్ముఖం కాదు. భూమిని దున్ని పదునుచేసిన తరువాతనే విత్తనాలు వేస్తే పంట పండుతుంది. అల్లాగే అప్పులు చేయడానికి కూడా నేను వివరింపబోయే కృషి ఎంతైనా అవసరము. దాని తరువాత ఈశ్వరుని కృప కూడా కావాలి.

ఒక్క పరమ రహస్యం ఏమిటీ అంటే కాస్త ఉన్న వాడికే అప్పు పుడుతుంది. కాని లేని వాడికి దమ్మిడీ పుట్టదు.

ఉన్నవాడికి అప్పు చేయువలసిన అగత్యం ఏమి వచ్చిందీ అన్న ప్రశ్న రాదు. సమయానికి సొమ్ము అందక పోవడమువలనా, ఉన్న డబ్బంతా ఏవ ర్తకాలలోనో పెట్టడము చేతా సాధారణంగా ధనవంతులు కూడా అప్పులు చేయవలసి వస్తుంది.

మనము అప్పులు పుట్టించాలన్నా సరిగ్గా ఆ కారణాలవల్లనే పుట్టించాలి గాని మరో కారణము వలన పుట్టించడము సాధ్యం కాదు.

"ఇతడు ఉన్నవాడే! ఏదో ఇబ్బంది వచ్చి అడుగుతున్నాడు. చేతికి డబ్బు అందడము తోటే ఇట్టే ఇచ్చి

వేస్తాడు. పేచీమనిషి కాదు. చాలా పెద్దమనిషి." అని ఊళ్లో వాళ్ళంతా మనలను గురించి అనుకొన్నప్పుడే మనకు అప్పు పుడుతుంది. కాని మన నిజస్థితి తెలిస్తే మెడమీద తల ఉన్నవారు ఎవ్వరూ దమ్మిడీ ఇయ్యరు.

ఈ విధంగా మనలను గురించి అనుకొనేలాగున చేయడమే, అప్పుకు బయలుదేరబోయేముందు మనము చేయవలసిన కృషి. ఈ లక్ష్యాన్ని సాధించడానికి కొన్ని మార్గాలు ఇక్కడ వివరిస్తున్నాను.

మొదటి విషయం : మనము ఎప్పుడూ మంచి విలువగల బట్టలు వేసుకొని తిరగవలె. రెండు జతలుంటే ఎప్పుడూ మంచి బట్టలతోనే కనపడవచ్చు. ఆ బట్టలు బయటికి వచ్చే సమయంలో ధరించి తదితర సమయాలలో పేలుంగీగుడ్డో కట్టుకొని కాలక్షేపం చేయవచ్చు. మనము ఇల్లాగ విలువగల బట్టలు ధరించడము చూచి ఇతరులు మనఎడల సద్భావం కలవారు అగుటకు అవకాశం ఉన్నది

రెండో విషయం : మనము మాట్లాడే మాటలలో దైన్యాన్ని పిరికితనాన్ని ఎప్పుడూ ప్రదర్శించకూడదు. బోలెడు డబ్బుపోసి నీవు నైజాం రాష్ట్రంలో గోదన్‌లో పొలాలు కొన్నావనీ, కోయంబత్తూరులో కొబ్బరిపీచు పరిశ్రమలో నీకు చాలా విలువగల షేర్లు ఉన్నవనీ, కలకత్తా పంచదార ఫాక్టరీలో ఒక పెద్దమొత్తం పెట్టు

బడి పెట్టినావనీ అందరూ అనుకొనేలాగున చేయడమే నీవు చేయవలసిన మొదటిపని.

ఒకరిద్దరు మంచి స్నేహితులను ఒక శుభదినాన నీవు కాఫీహోటలుకు తీసికొనివెళ్ళి, మాటలసందర్భంలో పై విషయాలు జారవిడిచి, మళ్ళీ ఎవరితోనూ అనబోకండి అని అంటివా ఆ విషయాలు ఆనోట ఆనోట పడి బ్రహ్మాండమైన వదంతులు అయి ఊరంతా పాకి పోతవి.

మధ్య మధ్య నీవు ఏవూరో వెళ్ళి ఒక వారం రోజులు కనపడకుండా ఉంటూఉండు. బోదన్‌లో పొలాలు చూచుకొంటానికి వెళ్లావనీ, కోయంబత్తూరులో కొబ్బరి పీచు పరిశ్రమలో షేర్లు అమ్మజూపడానికి వెళ్లావనీ రకరకాల వదంతులు సాధారణంగా వాటంతట అవే పుడతవి. పుట్టకపోతే పుట్టించాలె. దానితో నీ పలుకుబడి పెరుగుతుంది. నీవు ధనవంతుడవు అయినట్లు అంతా అనుకొని తీరుతారు.

నీవు మళ్లీ వచ్చిన తరువాత ఎవరైనా, "వారం రోజులనుంచి కనిపించడము లేదు. ఎక్కడకు వెళ్లారండీ?" అని అడిగితే నీవు ఏదో విసుగును ప్రదర్శించి, "ఏమిటోనండి, ఆబోదన్‌లో పొలాలు చౌకగా ఉన్నవి. చెరుకు పండుతుంది అని చెబితే ఏదో ఓ పదివేలు పెట్టి కొనిపారేసి ఉంచితే ఎందుకైనా మంచిది గదా, ఈ

సంవత్సరము కాకపోతే ఇంకో సంవత్సరమైనా పండవా అనుకొన్నాను. కాని ఏమంత లాభంగా లేవు" అను. ఈ మాటలు అని చప్పరించి ఊరుకో. అంటే పదివేల కర్చు నీకు ఒకలెక్కలోనిది కాదని వాళ్ళంతా అనుకొనేటట్లు ఉండాలె! అదీ ఆ చప్పరింపులోని ధ్వని !!

ఈ మాటలు విని అవతలవాడు ఆశ్చర్య పడి రెండు కళ్లూ పెద్దవిచేసి చూచి నీయందు గౌరవ భావంతోనూ, వినయంతోనూ ఏవో ప్రశంసా వాక్యాలు పలుకక మానడు. నీవు పదివేలు వెచ్చించడము ఏమీ గొప్ప విషయముగానీ, మెచ్చుకోదగిన విషయము గానీ కానట్లు మరొకసారి చప్పరించి ఊరుకో.

ఆ కోయంబత్తూరు పీచుసంగతి అడిగితే, "ఆ షేర్లు అమ్మాలనే అనుకొన్నాను. కాని నూటికి పది చొప్పున లాభాలు ఇస్తున్నారు. సంవత్సరాని ఓ రెండు వేలు అలాగ్గా వస్తున్నవి. ఇప్పుడు అమ్మకపోతేనేం? ఏమంటారు?" అను. అవతలవాడు "నిజమే లెండి" అంటాడు. దాంతో నీకు జోదన్‌లో పొలాలు, కోయంబత్తూరు పీచుపరిశ్రమలో షేర్లు దక్కినవన్నమాటె.

ఈ కీర్తి నీకు వచ్చిన తరువాత దండయాత్రకు చాలవరకు అన్నీ సిద్ధమైనట్లే నీవు భావించవచ్చు.

ప్రజలకు ఇష్టుడవైన నీపేరు అందరి నోళ్ళలోనూ పడేలాగున చూచుకో. దీనికి అట్టే కష్టపడనక్కరలేదు. కవులకు సన్మానం చేస్తానని చందాలు పోగుచెయ్యి.

ఇటువంటివిషయాలలో నిన్ను ఎవ్వరూ లెక్క అడగరు. కాని నీవు మటుకు సభలో వసూలు అయిన మొత్తం నూటయాభై రూపాయల ఆరు అణాలున్నూ దానికి గాను ఖర్చు అయిన మొత్తం నూటఎనభై తొమ్మిది రూపాయల రెండు అణాలున్నూ అయినట్లు చదివి విని పించు. అణాలలో ఆదా రూపాయలలో అప్పూ చూపించు. నీకు దీని వల్ల ప్రజాసేవకుడనే కీర్తి వస్తుంది, పిల్లలకుఓ సంవత్సరం దాకా మళ్ళీ బట్టలు కొనవలసిన అవసరమూ ఉండదు.

ప్రతివాడినీ చిరునవ్వుతో పలుకరించు. కాని ఎవ్వరితోనూ చాలాసేపు మాట్లాడుతూ కూర్చోవద్దు. నీవు ఎప్పుడూ ఏదో ప్రజాహిత కార్యాలలో నిమగ్ను డవై ఉంటావు కాబట్టి నీకు తీరిక అనేది ఉండదు. తెలిసిందా ?

ఊళ్ళో ఉన్న ధనవంతులతో పరిచయం చేసుకో. ఓట్ల హడావుడి వస్తే, ఎవరి పక్షమో ఒకరి పక్షము అవలంబించు. గెలుస్తాడు అని తోస్తేనే వాడి పక్షంచేరి పనిచెయ్యి. ఆ సమయంలో డబ్బుకు కక్కుర్తి పడకూ డదు. దమ్మిడీ పుచ్చుకోకుండా పనిచెయ్యి. డబ్బు పుచ్చుకొనే సమయం ముందు వస్తుంది.

ఇంకో రహస్యం ఏమిటీ అంటే అధికారుల ప్రాపకం ఉంటే అది ఎన్నో విధాల పనికొస్తుంది. తహ సీల్దారు గారింట్లో ఆయన తండ్రి తద్దినం ఎప్పుడో

కనుక్కొని బ్రాహ్మణులనూ వంట మనుష్యులనూ, అందరినీ కుదిర్చి పెట్టు. నిన్ను ఎవ్వరూ ఏమీ అనరు. "అక్కయ్యా" అంటూ యకాయకినీ వంటయింటి లోనికి వెళ్ళు. చేతనైన సాహాయ్యం చెయ్యి. తహసీల్‌దారుగారి భార్య అక్కయ్య అయితే డెప్యూటీ కలెక్టరుగారి భార్య పిన్ని అని తెలుస్తూనేఉండే, రెండూ రెండూ నాలుగైనట్లు! ఇంకేం పిన్నిగారికి ఏదో సాయము చెయ్యి. ఊరికే వారింట్లోకి వెళ్ళి వస్తూవుంటేనే చాలు నయ్యా నీకు బోలెడంత గౌరవం లభిస్తుంది. ఎవరింటికి పోయినా వాళ్ళ పిల్లలను ఎత్తుకొని ముద్దాడి వస్తూండు.

అయిందా. ఇంకొక పనిచేయాలె. ఏమిటీ అంటే, నీవు దైవభక్తి కలవాడవు అని ప్రజలంతా అనుకోవాలె. శని వారాలలో వీలైతే భజనలు ప్రారంభించు. ఆదివారంనాడు కొబ్బరి పచ్చడి చేయించుకోవచ్చు.

ఇల్లాగే నీవు దైవభక్తి కలవాడవనీ, ఆడినమాట తప్పి ఎరుగననీ, అధికారులతో పలుకుబడి కలవాడవనీ ఎప్పుడైతే అందరూ అనుకొంటున్నట్లు నీకు తెలుస్తుందో అప్పుడు నీవు కృతార్థుడవైనట్లు భావించు.

అప్పులు చేయడానికి అప్పటికి తగిన సమయము వచ్చిందన్నమాట!

ఇంకోపని కూడా చేస్తే మరీమంచిది. ఇద్దరు ముగ్గురు వ్యక్తులు, వాళ్లు ఎవరైనా సరే, నీపేర ప్రామి

సరీ నోట్లు వ్రాసిఇవ్వాలె. వాటివలన చాలా ప్రయో జనం ఉంది.

నీవు ఎవరితోనైనా మాట్లాడుతున్నపుడు, ఎప్పుడో ఈ సంగతి ఎత్తు.

"చూశారా ఆ పురుషోత్తం నాకు యాభై రూపాయిలు ఇవ్వాలె. రామయ్యగారు వందరూపా యలు ఇయ్యాలె. నోట్లు వ్రాయించి ఉంచుకొన్నా నన్నమాటే గాని ఎందుకండి ఇవి! వెధవ వందకూ రెండు వందలకూ కోర్టుకు ఎక్కుతానండీ!" అని అంటూ నీ ఔదార్యాన్ని ప్రకటిస్తూ ఉండు.

ఇవన్నీ జరిగిన తరువాత నీ స్థితి ఏ మెట్టులో ఉన్నదీ గుర్తించినావా? నీ డబ్బు అంతా నైజాంలో పొలాల మీద పెట్టావు. ఇబ్బందిలో ఉన్నవాళ్ళకు నీవు అప్పులు యిస్తే వాళ్లు తిరిగి ఇయ్యలేదు. అందుకని నీకు కాస్త డబ్బు అవసరం కలగడము ఏమీ విపరీతంగా కనబడదు ఎవ్వరికీ. సత్పురుషుడవనే కీర్తి నీకు ఉండనే ఉండె. ఆ స్థితిలో నీవు అప్పు అడగవలె గాని ఎవరు ఇయ్యకుండా ఉంటారు! పైగా నీవు అధికారులతో స్నేహంకూడా సంపాదిస్తివి. ఏవేళటప్పుడు ఏమి పని వస్తుందో నీతో! అల్లాంటప్పుడు ఏదో ఒక వంద, యాభై నీవు అడిగితే లేదని అంటానికి ఎవ్వరికీ మనస్క రించదు. ఎక్కడైనా తెచ్చి అయినా సరే నీకు ఇస్తారు.

## 4. ఎవరిని, ఎప్పుడు, ఎట్లా....

అప్పులు చేయడానికి ఉపక్రమించే ముందు చేయవలసిన కృషినంతా వివరించానుకదా. ఇక ఎవ్వరిని అప్పు అడగాలె? ఎప్పుడు, ఎట్లా? అడుగవలె అనే విషయాన్ని గురించి ఈ ప్రకరణంలో చెప్తాను.

పైనజెప్పిన విధంగా సంఘంలో పేరు ప్రతిష్ఠలు సంపాదించిన వ్యక్తికి మొదట్లో కొంచెం పెద్ద మొత్తాలే అప్పు పట్టడము అంత అసాధ్యము కాదు.
ఒక్క సంగతి గమనించవలసి ఉన్నది. డబ్బు అవసరమైనప్పుడే అప్పుకని బయలుదేరడము, చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకొన్నట్లు అవుతుంది. కనుక కొంచెం ముందుగానే జాగ్రతపడాలి, అప్పుఇచ్చే స్వభావం గల వాళ్ళు ఎవరో, దమ్మిడి చెయ్యి జారనివ్వనివ ళ్లెవరో ముందుగానే కనుక్కొని ఉంచుకోవాలె.

అదీగాక ఎవరిని ఏ సమయాన అడగవలసిందీ కూడా ముందు నిర్ణయించుకోవాలి. జూలై నెలలో ఈయీ పెద్దమనుష్యులను అడుగుదాము, ఆగస్టులో వీరిని అడుగుదాము అని ఒక లిస్టు వ్రాసి ఉంచుకొనడము మంచిది.

అవసరము వచ్చినపుడే అప్పుకై బయలుదేరుతారు కొందరు. అది బొత్తిగా తెలివితక్కువ పని. మనకు అవసరమైనపుడు అవతలపెద్దమనిషి ఇస్తాడన్న

నమ్మకం ఏముంది! అవసరమున్నా లేకపోయినా అప్పు తెచ్చి ఉంచుకోవడము తెలివైనపని... అవసరం రాగానే అప్పుగా తెచ్చి ఉంచిన ఆ మొత్తం అక్కరకు వస్తుంది.

ఒకచోట ఒక వందరూపాయలు అప్పు పుట్టగానే ఇంకేం ఇక ఫర్వాలేదు, ఏ అవసరము వచ్చినా గడుపు కొంటానికి ఇది ఉన్నది కదా అని ఊరుకోకూడదు. ఆ అప్పు తెచ్చిన మొత్తం కదిలించకుండా పొట్లం గట్టి పెట్టి అమగున భద్రంగా పెట్టేసి వెంటనే మళ్లీ బయలు దేరాలి ఇంకో అప్పుకు. మళ్లీ అప్పుచేయడము ఎందుకు ఇప్పుడు అనిగాని అనుకొన్నవాడు వట్టి అల్పుడే కాక సంకుచిత దృష్టి కలవాడు. అనికూడా చెప్పవలసి వస్తుంది. ఎందుకంటే ఇవ్వాళ మన జన్మ లగ్నా నికి ఏ శుభగ్రహ వీక్షణమో తగిలి అప్పు పుట్టింది. రేపు పుడుతుందని నమ్మకం ఏమిటి! అప్పు పుట్టే గడి యలలోనే చేయగలిగినంత అప్పు చేయాలె. దాని తరు వాత మనము తన్నుకున్నా దమ్మిడీ పుట్టకపోవచ్చు. కాబట్టి "మేక్ హేవైల్ ది సన్ షైన్సు" అన్నట్లు దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలె.

ఇల్లాగ పెద్ద మొత్తాలు ఒకేసారి అప్పుగా తెచ్చి ఉంచడము వలన లాభం ఏమిటీ అంటే ఇందులో ఎవ రైనా ఒకరు అప్పుగా తీసుకొన్న మొత్తం తిరిగి ఇయ్యా మని అడిగితే చటుక్కున ఆ మొత్తం విసిరి పారేసినట్లు

ఇచ్చివేయవచ్చు. ఇల్లాగ అడగడంతోనే ఇచ్చివేయ వేయడము మళ్లీ అతనిదగ్గరనుంచే పెద్ద మొత్తాన్ని గుంజటానికే నన్నమాట మాత్రము మరచిపోవద్దు!

అప్పు తేవడము రెండో కంటివాడికి తెలియ కూడదు. కాని అప్పు ఇచ్చివేయడము మాత్రం నలుగు రికీ తెలిసే పద్ధతిలో ఇచ్చివేయవలె.

ఆ నలుగురూ ఎవరూ అంటే మనకు ముందు అప్పు ఇయ్యబోయే వాళ్ళు అన్నమాట! నీవు ఏదో ఇబ్బంది వచ్చి ఓ వంద తీసుకొని మళ్లీ అడిగించుకో కుండా ఇచ్చివేస్తున్నట్లు వాళ్ళకు తెలియాలి ఈ పని సాధించడములో చాలా తెలివితేటలు ఉపయోగించ డము కూడా చాలా అవసరము.

మనము జూలై నెలలో "వి. ఎల్. నరసింహాం" గారిని రెండు వందలు అప్పుగా ఇమ్మని అడగాలని ప్లాను వేసుకొని కూర్చున్నాము. అప్పుడు ఏమి చేయాలీ అంటే వారింటికి వెళ్ళి కులాసాగా కబుర్లు చెబుతూ కూర్చుని చటుక్కున ఏదో జ్ఞాపకం వచ్చినట్లు నటించి "చూడండి మీ నౌకర్లలో ఎవ్వరు నమ్మకమైనవాడో వాణ్ణి ఒకసారి పిలవండి, కొంచెం పనుంది" అనాలె. ఎవడో ఒకడు వస్తాడు. ఆ తరువాత నీవు జేబులోనుంచి నోట్లకట్ట తీసి అందులోనుంచి నూరు రూపాయలనోటు ఎత్తి నరసింహాంగారికే ఇచ్చి, "పురుషోత్తంగారికి ఈ వందరూపాయలూ అందాలండీ. మొన్న ఏదో అవస

రం వచ్చి చేబదులుగా తీసికొన్నాను. ఇవ్వాళ ఇస్తా నన్నాను. మీతో మాట్లాడుతూ ఆ విషయం మరచి పోయినాను. చూశారా ఇస్తానన్న రోజుకు ఇచ్చి వేస్తేనే మాట దక్కుతుంది. ఏమంటారు?" అను. ఆయన "నిజమే ఆ మాట" అంటాడు. నిజమేనని ఆయన ఎప్పు డైతే అన్నాడో అప్పుడే నీయందు ఆయనకు సద్భావం కలిగిందన్నమాట !

పైన వివరించిన కార్యక్రమంలో ప్రతి చిన్న విషయానికీ ప్రాముఖ్యము ఉన్నది. ఆ నౌకరుకు డబ్బు ఆయన చేతే ఇప్పిస్తే, ఆ డబ్బుకు ఆయనే బాధ్యుడు అవుతున్నాడు. ఆయన చేతిమీదుగా ఇచ్చాడు కాబట్టి. నోట్లకట్ట ఎత్తి అందులోనుంచి నూరు రూపాయలనోటు తీయడము చూచినవాళ్ళు నీ దగ్గర చాలా డబ్బు ఉంటూ ఉంటుందనే విషయం గ్రహిస్తారు. ఇస్తానన్న రోజుకు ఇచ్చి వేయడము మంచిది అనడములో నీ సిజా యితీ తనము, మాట నిలుపుకొనే పట్టుదల, సత్యసంధత ఇవన్నీ బైటపడతవి.

ఇంకో విషయము ఏమిటీ అంటే ఆ పెద్దమనిషికి డబ్బు ముట్టినట్టు రసీదు తీసికొని రా అని నీవు చస్తే అనకూడదు. ఎందుకూ అంటే అది నీ దర్జాకు తగదు. ఆ పెద్దమనిషి ఒకవేళ డబ్బు ముట్టలేదూ అంటే విచార పడవలసింది ఆ నరసింహాంగారు గాని నీవు కాదుగా !

రసీదు అడక్కపోవడములో ఇంకొక సుగుణము ఏమిటీ అంటే నీవు ఇల్లాగ వందా రెండువందలూ చులాగ్గా చేబదుళ్లు తెస్తూ మళ్ళీ ఇచ్చేస్తుంటావూ అని అవతల వాళ్లు విధిగా అనుకొంటారు.

ఇలాగ వ్యవహారం నడుపుకోవాలె. మొదటిరోజులలో అక్కడ తెచ్చి ఇక్కడా, ఇక్కడ తెచ్చి అక్కడా ఇస్తూ పలుకు బడిని వృద్ధి చేసుకోవాలె. ఎగగొట్టే సంగతి ఇప్పుడుకాదు. తగినంత ఆస్తి కూడిన తరువాత ఆ విషయమై ఆలోచించ వచ్చు. ఈ విషయంలో తొందర ఏమాత్రమూ కూడదు.

ఈ విధంగా సాగినంత కాలము ఎవ్వరికీ తెలియకుండా వాడిదగ్గరా వీడిదగ్గరా అప్పులు చేసి, కొన్ని తీరుస్తూ, తీర్చినదానికి మళ్లీ రెండింతలుగా అప్పుచేస్తూ కన్నుమూస్తూ, తెరుస్తూ గడిచినంత కాలము గడిపి, మనకు బోదన్‌లో పొలాలు లేవనీ, కోయంబత్తూరులో పేచు లేదనీ, తెలిసిన తరువాత చేతులు రెండూ పైకెత్తవచ్చు. అది ఇప్పటి సంగతికాదు! దానికో విధానం ఉన్నది. అదీ చెపుతాను దాని విషయం వచ్చినపుడు.

అయితే ప్రతి ఋణం తీర్చాలని పెట్టుకోకూడదు. తీర్చకుండా కాలం గడపడమే మన ప్రిన్సిపుల్. తీర్చడమనేది మళ్ళీఅప్పు దొరకించుకొంటానికే అన్న విషయం ఏ క్షణానా మరిచిపోకూడదు. అప్పు ఎప్పుడు అడగ

వలెనో ఇంతవరకు చెప్పినాను. ముఖ్యంగా నేనుచెప్పిన రహస్యం ఏమిటీ అంటే, అవసరము వచ్చినప్పుడు అప్పుకు బయలుదేరకూ అని! ఇల్లు అంటుకున్న తరువాత బావి త్రవ్వడము ఎవ్వరైన ప్రారంభిస్తారటయ్యా! ముందుగా త్రవ్వించి ఉంచుకోవాలె అట్లాగే అప్పులు తెచ్చి ఉంచుకోవాలె. ఇటువంటి దాన్నే "ముందు ఆలోచన" అంటారు. ఏ విషయంలోనైనా సరే ముందు ఆలోచన ఉండటము మనిషి అయిన వాడికి ఉండవలసిన సుగుణాలలో ఒకటీ అని మా సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఎప్పుడూ అంటూఉంటారు. అదిపరమ సత్యం!

ఈ ప్రసంగం ఇంతటితో ఆపేసి అప్పు అడిగే పద్ధతులనుగురించి తరువాత ప్రకరణంలో ముచ్చటిస్తాను.

## 5. అప్పు అడిగే పద్ధతులు

ఎవరినైతే అప్పు అడుగ దలచుకున్నావో అతనితో పరిచయం కావడమూ, అతడు నిన్ను గురించి సద్భావంకలిగి ఉండేలాగున చేయడమూ ఇవన్ని అయిపోయిన తరువాతనే దండయాత్రకు బయలు దేరాలె.

అప్పు అడగటము అనే కార్యాన్నే దండయాత్ర అంటున్నాను. ఈ అప్పును గుంజడములో శాస్త్రీయ పద్ధతులను వివరిస్తాను.

పిసుగు పద్ధతి అనేది మొదటిది. యుద్ధంలో శత్రుసైన్యం పైన హఠాత్తుగా పడ్డట్లు మనము హఠాత్తుగా ఋణదాతపై పడి, చాలా తొందరలో ఉన్నట్లూ, అవతల కొంపలంటుకు పోవడము వల్ల మాట్లాడడానికి కూడా వ్యవధి లేనట్లూ, చూస్తూ "చూడండీ, ఓ వందరూపాయలు అర్జంటుగా కావలసి వచ్చింది" అని ఇంకేమీ మాట్లాడకుండా చేయి జాపి ఊగకోవడము ఈ పద్ధతి లక్షణం. అవతల మనిషి ఊపిరి పీల్చుకోటానికి కూడా మనము వ్యవధి నియ్యకూడదు. ఊదర పెట్టాలి.

అయితే ఒకటి. అవతల పెద్దమనిషి తప్పక ఇస్తాడని నమ్మకం ఉన్నప్పుడూ, ఇనప్పెట్టెలో డబ్బు ఎప్పుడూ ఉంటుందని నమ్మకం ఉన్నప్పుడూ మాత్రమే ఈ పద్ధతిని అవలంబించ వలసి ఉంటుంది.

అతనికి నీయందు ఇదివరకే మంచి అభిప్రాయం ఉన్నది కాబట్టి ఏమి కొంపమీద కొచ్చిందో ఏమో పాపం అని చటుక్కున పెట్టె తెరచి వందరూపాయలూ తీసికొచ్చి నీకు ఇచ్చేయ వచ్చు.

ఒకప్పుడు వంద లేవే అని వెధవ ముఖం పెట్టి సందేహంతో చూస్తాడు ఆ మిత్రుడు. అప్పుడు నీవు, మాట్లాడుతూ కూర్చుంటానికి అది ఏమాత్రమూ సమయము కానట్లు, "సరే, ఎంత ఉంటే అంతా ఇవ్వవయ్యా చప్పున... చంపక... మిగిలినది [illegible]

కొట్లో గుమాస్తాను అడిగి పుచ్చుకొంటానులే," అని తొందర పెడుతూ చెయ్యి ఆడించాలె.

గాఢమైన మైత్రీ, తొందర పెట్టే విధానమూ నీకు జయాన్ని చేకూర్చి పెడతవి. సత్యనారాయణమూర్తి గారు, రామకృష్ణరావును ఈ పద్ధతినే అడుగుతూ ఉండే వాడు. "రామకృష్ణరావూ ఏదీ రెండు వందలు అర్జంటు-తే"—అనేవాడు. ఈయన ఇచ్చివేస్తూ ఉండేవాడు.

ఈ పద్ధతిని అడగటములో ఆడవాళ్ళ దగ్గర సులభంగా విజయము సాధించవచ్చు. ఆయాసపడుతూ పెద్దపెద్ద అంగలతో ఇంట్లో ప్రవేశించి రొప్పుతూ, "అక్కయ్యా బావగారు ఇంట్లో లేనట్లుందే, సరేపోనీ, అర్జంటుగా కావలసి వచ్చిందక్కయ్యా ఒకవంద. కొంప మీది కొచ్చింది ఓ వ్యవహారంలో! కాస్త అడ్డంపడి తివో నీ కెంతైనా పుణ్యం ఉంటుంది." అనవలె.

సాధారణంగా ఆమెగారు లేదు అని అనదు. డబ్బు తీసుకొని గబగబా పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోవచ్చు.

అయితే ఈ విధంగా ఋణమును సాధించడములో మళ్ళీమళ్ళీ అడగడానికి వీలుఉండదు. ఒక్కసారి లేదనే మాట వచ్చిందా ఇక నోరు మూసుకొని ఊరుకోవడమే కర్తవ్యము.

ఇక రెండో పద్ధతి ఏమిటీ అంటే స్నేహితుని కలుసుకొని ముందు కొంతసేపు ఆ విషయాలూ ఈ విషయాలూ మాట్లాడడంతో దండయాత్ర ప్రారంభించాలె.

ఆ తరువాత ఆయనకు సంతోషము కలిగే మాటలు ఏవైనా చెప్పవలె, రాబోయే ఎన్నికలలో తప్పకుండా పోటీ చెయ్యవలసిందనీ, ఈ తఫా జయం తప్పదనీ అల్లాగ.

ఆ తరువాత మెల్లగా సిగ్గుపడుతూ నీ అవసరాన్ని గురించి చెప్పి "ఓ యాభై రూపాయిలు సర్దితివా, నెలరోజులలో మళ్లీ ఇచ్చేస్తాను. కోయంబత్తూరు షేర్ల మీద డివిడెండు రావటము ఆలస్యమైందయ్యా, లేక పోతే నిన్ను అడిగే వాణ్ణి కాదు. అసలు ఒకరిని అప్పు అడగటమూ అంటే నాకు తలకొట్టేసి నట్లుంటుంది. తప్పనిసరియై నీ దగ్గర కొచ్చాను" అనాలె.

ఈ పద్ధతిని అడగడములో లాభం ఏమిటీ అంటే, ఆ పెద్దమనిషి ఆ సమయంలో లేదంటే, "పోనీలే బాబాయి, రేపు వస్తాలే" అని వెళ్ళిపోవచ్చు. ఇల్లాగ ఇరవైసార్లు అయినాసరే అడిగి మనకు కావలసిన డబ్బు తీసుకొంటానికి ఈ పద్ధతిలో అవకాశమున్నది.

నిరుత్సాహ పడడము కాని, అధైర్య పడడము గాని ఏ స్థితిలోనూ కూడదు. పొద్దున్నే పెందలాడే లేవ

డము, అక్కడికి వెళ్ళి కూర్చోడం! ఆయన నిద్ర లేచే సరికి మనం కనపడాలె. ఇక తప్పించుకోలేడు. కాఫీ టిఫిన్ మొదలైనవి అక్కడే ఆయనతోపాటు జరుపుకో వచ్చు! జీడిలాగ పట్టుకొని వదలకూడదు. ఈపీడ వదిలించు కొంటానికైనా ఆయన ఇవ్వకతప్పదు. ఈ దండయాత్ర జయప్రదం అవుతుంది.

ఆయన సందేహిస్తున్నట్లు కనపడితే, వంటింట్లో సెకండు ఫ్రంటు ఓపెన్ చెయ్యి. అక్కగారిచేత ఆయనకు చెప్పించు. ఆడవాళ్ళు సాధారణంగా జాలిస్వభావం కలవాళ్ళు. నీవు చెప్పిందంతా నిజమే కాబోలునని ఇట్టే నమ్మేస్తారు. “చూడు అక్కయ్యా బావగారితో చెప్పి కాస్త సాహాయ్యం చెయ్యాలన్నా. నేను ఎంతో ఇబ్బంది వస్తేగాని అడగనని నీకు తెలుసుగా! అసలు నాకు అప్పు అంటేనే తలకాయ నొప్పి! ప్రాణంమీదికొస్తే ఏంజేసేది అక్కయ్యా! సీతారామయ్యను అడిగితే యాభై కాదు వందఅయినా ఇస్తాడు. కాని ఛా, ఛా ఇంత బ్రతుకూ బ్రతికి వాణ్ణి అడుగుతానా! సాటివాళ్ళ దగ్గర లేదనిపించుకున్నా మర్యాదే కాని, వాడిదగ్గర దేహీ అని చెయ్యి జాపడము నా కిష్టంలేదు. అక్కయ్యా నీ వేమన్నా అను! అదీగాక ఇంకెవ్వరినైనా అడిగితే, ఏమంటారో తెలుసా, ‘ఏమయ్యా మీవాడు బంగారు. కొండలాగ ఉండనే ఉందెగదా, మమ్ములను అడిగిన దాకా నీకేం కర్మం వచ్చింది!’ అంటారు.

"నిజం అంటేగా అక్కయ్యా. ఒకరిని అడగవలసిన కర్మం నాకేం పట్టింది చెప్పు నీవు ఉండంగా!

"ఇంతా జేస్తే ఒక్కపంద! ఏమంత పెద్ద మొత్తమూ కాదు నిజానికి! మళ్ళీ ఒక నెల రోజులలో ఎట్లాగూ సొమ్ము అందుతుంది. ఆ ఆసాములు తెచ్చిఇస్తారు. ఎవరికైనా వస్తుంది ఇబ్బంది. ఏమంటావు అక్కయ్యా!" అని ఉపన్యాసం ఇయ్యి.

ఈ మాటలు విని ఆ అక్కయ్యగారు ఆ మాటా నిజమేనని తల ఆడించి నీకు సహాయము చేయమని భర్తతో చెప్పి, సొమ్ము ఇప్పిస్తుంది.

ఈ పద్ధతిలో వ్యవహారం జరిపేటప్పుడు ఎన్ని సార్లు అడిగినా ఫరవాలేదు. ఎంతకాలం గడిచినా ఫరవా లేదు.

మరొక్క సంగతి జ్ఞాపకం ఉంచుకో. ప్రొద్దుట ఈ మిత్రునిదగ్గర అప్పుకై ప్రయత్నం చేస్తున్నావా, సాయింత్రం ఏం జేస్తావు? ఇంకోచోట ఇదే దండయాత్ర సాగిస్తూఉండు. రెండుచోట్లనుంచి వస్తేరాని? ధనలక్ష్మి ఘల్లుఘల్లున నడిచివస్తుంటే వద్దువద్దని చేతులు అడ్డు పెట్టక ఎదురెళ్ళి ఆహ్వానించు!

నీ తెలివితేటల నుపయోగించి చేయగలిగిన చోట్లల్లా చేయగలిగినంత అప్పు చేసెయ్యడమే ప్రయోజకత్వానికి లక్షణం.

ప్రపంచాన్ని నీవు చూచే దృష్టి మారిపోవాలె. ఎవరినైనా కొత్తవాణ్ని చూడడముతోనే, వీడు మనకు పనికివచ్చే మనిషేనా, ఎప్పటికైనా వీడిదగ్గరనుంచి ఓ పాతికో పరకో రాలుతవా అనే ఆలోచన తప్ప మరో ఆలోచన రాకూడదు. ఇల్లాగ తయారుకావడానికి ఎంతోకాలం పట్టదు. మనతత్వము ఈ విధంగా మారిన తరువాత, ఇక మన ప్రతి కదలిక ఈ లక్ష్యసాధనకై చేయబడే ప్రయత్నము అయికూర్చుంటుంది.

కొంతమంది మందకొడి స్వభావం కలవారుగా ఉంటారు. నీవు వెళ్ళి, "బాబాయి ఒక వంద రూపాయలు చూడాలె. ఎట్లాగయినా" అని అంటావా ఆయన ఏమీ జవాబుచెప్పక ఊరికే ఏదో ఆలోచిస్తూ, ఎటోచూస్తూ ఊరుకొంటాడు. అప్పుడు నీవు ఎదుట స్తంభంలాగ అలాగ నిలువబడి ఊరుకోకూడదు. "ఏమిటి ఏదో సందేహిస్తున్నావు. లేవయ్యా బాబు... మళ్ళీ వారంరోజులలో ఇచ్చేస్తానులే.." అని వీపుమీద చరిచి ప్రోత్సహించవలసి ఉంటుంది. కొందరు అల్లాగ చరిచిన తర్వాత మెల్లిగా లేచి ఇనప్పెట్టె తాళం తీస్తారు.

అయితే అందరినీ వీపు మీదే చరవాలె అని నియమం ఏమీలేదు. కొందరి విషయంలో నెత్తిమీద అరచెయ్యి ఆనించి మృదువుగా నిమర వలసివస్తే

వేసి ప్రకరణం మార్చు. అంతేగాని నిరాశచెంది ఆ ప్రయత్నమే మానివెయ్యడము నీవు చెయ్యాలిసిన పని కాదు.

ఇంతకూ ఒకసంగతి. మన చేతిలో డబ్బు పడ్డ దాకా పట్టిన మనిషిని వదలకూడదు. బతిమిలాడు. భంగపడు. నిష్ఠురోక్తులాడు. ఏదైనా ఆశపెట్టు. నీ కష్టాలు అంటే పిల్లలు జ్వరంతో బాధపడుతున్నారని, భార్యకు నీళ్లాడే ప్రొద్దులనీ, ఇల్లాగ; నీ ఇష్టంవచ్చినట్లు చెప్పి అతనికి జాలి కలిగేలాగున ప్రయత్నించు. అప్పటికీ లాభం లేకపోతే చేయగల పని ఒకటే ఉన్నది. ఏమిటీ అంటే, ఉత్తరీయం ముఖాన కప్పుకొని భోరున ఏడ్వటము! దీనికే "యార్గుమెంటమ్ వెరికుండియమ్" అంటారు!...చాలా కేసులలో ఈ క్రియ పనిచేసింది! అప్పటికీ లాభము లేకపోతే మనస్సులో అవతలవాణ్ణి తిట్టి బహిరంగంగా మటుకు నిన్ను తిట్టుకొని, వెళ్ళి పోవడముకంటే చేసేది ఏమీలేదు.

ఒకసారి ఏడిస్తే లాభం లేక పోతే రెండుమూడు సార్లు ఏడిస్తే లాభించిన కేసులు కొన్ని ఉన్నవి. ఒక సారి కంటే ఎక్కువసార్లు ఏడ్వవలసి వస్తే ఒక్కొక్క సారి ఒక్కొక్క పద్ధతిలో ఏడ్వడము మంచిది.

మొత్తంమీద కార్యసాధన చేయాలెగాని యుద్ధభూమినుండి పారిపోయిరావడము నేను ఒప్పుకోను.

అప్పుఅడిగే పద్ధతులు వివరిస్తూనే, ఎవరిని అడగ వలె అనే విషయంకూడా కొంతవరకు పరామర్శ చేసినాను. ఆ విషయంలో చెప్పదగిన మాట ఒక్కటే ఉన్నది. ఏమిటీ అంటే అప్పు అడుగ తగినవారూ,అడుగ తగనివారూ అంటూ లేరు. ఎవ్వరినిబడితే వారిని అడగ వలసిందే !

మన రాజ్యాంగ విధానంలో కులభేదాలు గుర్తింపబడ లేదు. అందరూ సమానులే. అప్పు అడిగే విషయంలో కూడా మనము కులాలను గుర్తించవలసిన అగత్యం లేదు.

కులభేదాలు ఒక్కటేగాదు. మనకు ఉన్నవాడు లేనివాడు అనే విచక్షణ కూడా అక్కరలేదు. అప్పు ఇయ్యడమే మనకు ప్రధానం, ఎవ్వరు ఇస్తేనేమి ! అప్పు ఇచ్చిన వాళ్ళందరూ ఈ సర్వస్వాతంత్ర సమాఖ్యలో సభ్యులుగా చేరిపోతారు. ఆడా మొగ అనే విచక్షణ కూడా పెట్టుకోకూడదని ఇదివరకే చెప్పినాను. మైనారిటీ వెళ్ళని యువకుల దగ్గరకూడా అప్పులు పుట్టించ గలిగితే పుట్టించడమే మంచి పని కాని ఆ విషయంలో ఏవిధమైన సంకోచమూ పెట్టుకోకూడదు.

ఇంకొక్క విషయము ఉన్నది. భర్తలేక, మొగ దిక్కులేక అల్లాడుతూ ఉన్న వితంతువులు ఎవరున్నారో గుర్తించి వాళ్ళకు చిన్నచిన్న సాహాయ్యాలు

చేస్తూ, పరిచయం ఏర్పరుచుకొని నేర్పుగా వాళ్ళ దగ్గర పాతికా పరకా లాగేయడము అంత కష్టమైన పని కాదు. పాపం వాళ్ళు దిక్కులేనివాళ్లు కాబట్టి, వాళ్ళ దగ్గర పెద్ద మొత్తాలకు ప్రయత్నించకు. ఒకవేళ, కీడెంచి మేలెంచమన్నాడు, మనం ఇవ్వలేకపోతే, ప్రతి ఆవిడా, ఏదో కొద్ది మొత్తమును పోగొట్టుకొన్నదే అవుతుంది గాని అసలుకు మోసం ఉండదు.

వితంతువుల వద్ద అప్పు పుచ్చుకొన్నపుడు వద్దు అంటూ ఉన్నా నోటు వ్రాసి పారెయ్యి. "చూడు అత్తయ్యా ఎవరి తనువూ శాశ్వతం కాదు. ఏ క్షణాన ఏమి జరుగుతుందో ఎవ్వరం చెప్పలేముగదా! నోటు అంటూ ఉంటే అందరికీ క్షేమము" అని చెప్పు. మోసం చెయ్యాలనే ఉద్దేశం నీకు ఏ కోశాన్నీ లేనట్లు వాళ్ళకు నమ్మకం కలుగుతుంది. నోటు ఉంటే లాభం ఏమిటి అంటే వాళ్ళు ఇచ్చిన మరునాటినుంచీ నిన్ను పీకు తినరు. అది ఒకటిన్నీ, ఇంకొకటి ఏమిటీ అంటే, నీ ఇంట్లో పండుగైనా, పబ్బమైనా, తద్దినం వచ్చినా, వేరే వంట ఆవిడను పిలువవలసిన అవసరం ఉండదు, "అత్తయ్యా, అత్తయ్యా నీవు రావాలి" అంటే ఆమె కాదనలేదు. అంటే నీకు కోపం వస్తుందేమోనని ఆమెకు భయము!

" గొడ్డుటావు బితుక కుండ గొంపోయిన
పండ్లు రాల దన్ను, పాల నీదు
లోభివాని నడుగ లాభంబు లేదయా "

# 6. అప్పులు తీర్చేమార్గాలు

ఇక అప్పు తీర్చేమార్గాలను గురించి ఈ ప్రకరణం లో వివరిస్తాను.

ఋణదాత మనకు ఇచ్చిన అప్పు విషయమై మళ్ళీ ఎత్తకుండా చేయడమే మనము అప్పులను తీర్చ డములో గల ఉద్దేశము. ఈ ఫలితాన్ని మరియొక విధంగా సాధించినా తీసుకొన్న డబ్బును మళ్ళీ ఇచ్చి వేసినా ఒకటే. మనకల్లా కావలసింది అప్పు ఇచ్చినవాడు నోరు మూసుకొని ఊరుకోవడము. ఈ పని ఏవిధంగా సాధించినా అప్పు తీరిపోయినట్టు లెక్క!

కాబట్టి ఇంతకూ నేను ఏమి చెప్పవలయునని ప్రయత్నము చేస్తున్నాను అంటే అప్పు ఎగగొట్టడము, అప్పు తీర్చేమార్గాలలో ఒకటి అని!

అప్పు తెచ్చినపుడే ఆ అప్పు తీర్చకుండా ఉపా యము ఆలోచించి పెట్టుకోవాలె. అవసరం వచ్చింది గదా అని ఏమీ ఆలోచన లేకుండా చటుక్కున అప్పు తెచ్చిదాని తరువాత తీర్చే, అంటే ఎగగొట్టే, ఉపాయం కోసం వెదకడము శుద్ధ తెలివితక్కువ. ఏ పని అయినా ముందు ఆలోచనతో చెయ్యాలె అని ఇదివరలో చెప్పి నాను.

ఎగగొట్టడము అన్నా తీర్చడము అన్నా ఒకటే కాబట్టి, ఇకనుంచి తీర్చడము అనే మాటనే ఉపయోగిస్తాను, ఎగగొట్టడము అనే అర్థంలో.

ఇక అప్పు తీర్చడము అనే కార్యక్రమము ఒక పద్ధతిని అనుసరించి ఒక క్రమమును అనుసరించి జరగవలసి ఉంటుంది.

ఆ క్రమము ఏమిటో ముందు టూకీగా చెప్పి తరవాత వివరాలు చెపుతాను. మొదట ఋణదాత కళ్ళకు కనపడకుండా కొన్నాళ్ళు తప్పించుకొని తిరగాలె. ఆ తరవాత "ఏమండీ ఆ డబ్బు ఇచ్చారుగారు?" అని అడిగినపుడు "ఇస్తానులెండి. ఆ బోదన్ పొలాలమీద నాకు రావలసిన సొమ్ము రావడంతోనే ఇస్తాను. కాస్త ఆలస్యం అయితే చంపుకుతింటే ఎట్లామరి" అని విసుక్కోవాలె. ఇల్లాగ కొన్ని నెలలు గడిపివేయవచ్చు. ఆ తరువాత ఋణదాత అప్పుసంగతి ఎత్తగానే కస్సుమంటూ ముందుగానే మనము వాడి మీద విరుచుకుపడాలె.

వ్యవహారం ఈ స్థితికి లాక్కురావడమే కష్టంగాని, దాని తరవాత ఏమీ కష్టం వుండదు. ఆ పైన వ్యవహారం నడకను బట్టి, మీకు ఇవ్వవలసిందంతా ఇదివరకే ఇచ్చివేసినాననో, అసలు నాకు మీరు ఇవ్వలేదనో, ఏదోవిధంగా అని వ్యవహారం పరిష్కారం చేసుకో

వచ్చు. ఆ తరవాత అతడు ఆ విషయం ఎత్తడు. అప్పు తీరిపోతుంది. ఈ కార్యక్రమము నడపడాన్ని గురించి ఇక వివరంగా చెపుతాను.

మొదటి స్టెప్: అప్పు ఇచ్చిన ఆసామికి కనపడకుండా తిరగడం నేర్చుకోవాలె. అతనికి చస్తే కనిపించకూడదు.

అప్పు ఇచ్చిన ఆసామి సాధారణంగా ఏ దారిన వస్తూఉంటాడో గుర్తుపెట్టుకొని నీవు ఆ మార్గం వదిలేసి కాస్త చుట్టుఅయినా సరే ఇంకోమార్గాన నడుస్తూ ఉండడము అన్నివిధాలా శ్రేయస్కరము. ఇల్లాగ మార్గాంతరము పట్టి తిరుగుతూ సంవత్సరాలు గడిపిన వివేకవంతులు ఉన్నారు. ఈ క్రియ వల్లనే చిల్లర బాకీలు చాలవరకు తీరిపోతవి. మా రుక్మిణీనాథశాస్త్రి ఈ పద్ధతిని కనిపెట్టి నాకు చెప్పాడు. నేనూ ప్రయోగించి చూశాను. లాభించింది ! మొదటి రోజులలో ఇల్లాగ తప్పించుకొని తిరిగి, ఓ సంవత్సరం అయిన తరువాత ఎదుటబడ్డా ఫరవాలేదు అప్పటికి అతను మనస్సులో విసిగిపోయి "పోతే పోయిందిలే" అని ఊరుకొనే స్థితికి వస్తాడు. నీకు ఆ విషయం అసలే జ్ఞాపకం ఉండదుగదా !

అయితే మొదటిరోజులలో తప్పించుకు తిరగటములోనే కొన్ని చిక్కులు వస్తూ ఉంటవి. అప్పు ఇచ్చినవాణ్ణి ఎంత తప్పించుకు తిరుగుతున్నా ఒకప్పుడు

ఇంకో మార్గంలేక వాడు వస్తూ ఉన్న మార్గాన్నే ఎదురుగా నీవూ నడవ వలసి వస్తుంది. చాలా దరిద్రపు అవస్థ అది. ఎట్లా! ఎదట బడితే నిలవేసి అడుగక మానడు. అప్పుడు నీవు ఏమి చేయాలె అంటే వాడు రోడ్డుకు కుడివైపువ నడుస్తూ ఉంటే నీవు ఎడమవైపుకు తప్పుకో. వాడు ఎడమవైపున వస్తుంటే నీవు కుడివైపుకు తప్పుకోవాలె. ఇది చాలా సులభంగా గ్రహింపతగిన విషయము.

అంతగా ఎదటబడటమే తటస్థిస్తే, తెల్లముఖం వేయక, ధైర్యంగా నిలువబడి నమస్కరించి పలుకరించి ఆ సంగతీ, ఈ సంగతీ మాట్లాడి అసలు సంగతి మాత్రం ఎత్తకుండా వెళ్ళిపోవడము ఒకవిధము.

మొదటిరోజులు కాబట్టి ఆ సంగతి అతడూ ఎత్తడు, నీవూ ఎత్తవు. ఆ ఆసామి బాకీ సంగతి ఎత్తడము జరిగిందా ఇక ఆ రోజునుంచి నీవు నీ పద్ధతులను మార్చుకోనవలసి ఉంటుంది.

నేనూ మా రాముడూ వెళ్తున్నాము. వాడు చెపుతూనే వున్నాడు "బాబాయి, ఈ దారి మనకు నిషేధము సుమా" అని. "ఫరవాలేదు రావోయి" అన్నాను. నేను ముందుకుచూస్తూనే ఉన్నాను. వాడు వెనకాల నుంచి పరుగెత్తుకుంటూ వచ్చి మమ్మల్లను కలుసుకొని, "ఏమండీ, ఏమి పెద్దమనిషితనం ఇది? ఇరవై రూపా

యలు చేబదులుగాతీసుకొని సంవత్సరం అయిపోయిం ది .
ఇస్తారా, ఇవ్వరా చెప్పండి?" అని అడిగాడు.

మావాడు తొణుకు బెణుకు లేకుండా ఆ ఋణ దాతవంక చూచి, బుజంపైన చెయ్యివేసి ఊపి, నవ్వి "అప్పుస్ బ్రదర్! ఏదో పనితొందరలో ఉండి ఆ విషయం మరిచిపోయినాను. ఛా! ఛా! నాకే సిగ్గుగా ఉన్నది. ఎందుకూ!- ఇప్పుడే ఇచ్చేస్తాను. మీ రిక్కడే ఉండండి సాంబశివరావు కొట్టుకెళ్ళి పట్టుకొస్తాను. చూడండి, ఈ కృష్ణుడి కాఫీ హోటలులో ఉండండి. ఎక్కడికీ, వెళ్ళకండే ! పది నిమిషాలలో వస్తాను" అని కేకేసి మేము కూడా వస్తాము అని అంటున్నా వినిపించుకోక పెద్దపెద్ద అంగలు వేసుకొంటూ పౌరుషంగా వెళ్లి పోయినాడు. డబ్బు తెచ్చి విసిరి పారేస్తాడు అను కొన్నాము.

మేము ఇద్దరం కాఫీ హోటలుకు వెళ్లి కాఫీతాగి మాట్లాడుతూ కూర్చున్నాము. పదినిమిషాలైంది. ఇరవై నిమిషాలైంది. అరగంట అయింది. రాముడు రాలేదు.

ఏంజేస్తాం? మేము ఇద్దరం ఆ సాంబశివరావు కొట్టుకెళ్ళి విచారించాము. అక్కడికి వెళ్ళి, ఇరవై రూపాయలు అర్జంటుగా ఇమ్మని అడిగినాడట. సాంబ శివరావు లేవన్నాడు. అప్పుడు రాముడు, "ఛీ వెధవ బ్రతుకు ఇరవై రూపాయలు పుట్టించ లేక పోతిని. ఇవ్వాళ ఎక్కడైనా సరే, ఇరవై రూపాయలూ తెచ్చి

ఆయనకు ఇచ్చిగాని నేను భోజనం చేయను" అని ప్రతిజ్ఞ చేసి ఎక్కడికో దూకుడుగా వెళ్ళిపోయినాడట. ఈ సంగతి విని మేము ఇద్దరం కూడా ఆశ్చర్య పడ్డాము. ఇంక చేసేదేముంది. ఆయన దారిన ఆయన వెళ్లి పోయి నాడు. నా దారిన నేను వెళ్లిపోయినాను. ఆ తరువాత మా రాముడే చెప్పాడు. ఆ దెబ్బతో ఆ బాకీ తీరి పోయిందనీ, మళ్లీ ఆ ఋణదాత కనపడలేదనీ ! బాకీలు తీర్చడానికి ఇది ఒక న్యాయమైన మార్గము.

అప్పు ఇచ్చిన ఆసామి వెనుక నుంచి వస్తున్నా డేమోనని కూడా చూచుకో వలసి ఉంటుందనే విష యము మనకు పై కథ వల్ల విశద మైనది.

ఇంకో సంగతి ఏమిటీ అంటే ఎవరైనా పిలిస్తే అసలు పలుక కూడదు. అసలు అల్లాగ పిలువడము మర్యాద ఏమాత్రమూ కాదు. ఎవరైనా పిలిస్తే తిరిగి చూడడము మన దర్జాకు లోపమని జ్ఞాపకం ఉంచుకో. ఎడవల్లి సూర్యనారాయణ చచ్చి ఏలోకాన ఉన్నాడో కాని బ్రతికి నన్నాళ్లూ మహా దర్జాగా బ్రతికినాడు. వెనుకనుంచి పిలిస్తే చస్తే పలికేవాడు కాదు! ముందుకు వచ్చి నమస్కరిస్తేనేగాని తలఎత్తి చూచేవాడు కాదు! మనము అవలంబించవలసిన పద్ధతీ అదేనని చెప్పడానికే ఆయన పేరు ఎత్తినాను.

అయితే అప్పులవాడు హఠాత్తుగా రావడము జరిగిందా, నీవు చటుక్కున తల వంచేసుకొని గబగబా

చాలా అవసరమైన పనిమీద వెళ్ళుతున్నట్లు దూసుకు పోవాలె.

కాఫీహోటలులో కనపడితే గిరుక్కున వెనక్కు తిరిగి పారిపోవడము భీరువు చేయ వలసిన పని. ఆ పని ఎప్పుడూ చెయ్యకు. నీవు సరాసరిని వెళ్ళి ఆ ఆసామి ప్రక్కనే కూర్చుని అతనికి కావలసిన వన్నీ తెప్పించి ఇచ్చి బిల్ నీవే ఇచ్చి వేసివెయ్యి. దాంతో అతని నోరు కట్టడుతుంది.

ఒకవేళ నోరు తెరిచి అడిగితే అంతకు ముందు ఎంతో సంతోషంగా ఉన్న వాడివల్లా చటుక్కున ముఖం చిట్లించి పెద్దగా, "ఏమిటయ్యా వెధవ వంద రూపాయలకోసం కొంప మునిగి పోయినట్లు భయ పడ తావు! బోదన్‌లో రెండు ఎకరాలు నీ పేర వ్రాసి యిస్తాను కావలిస్తే తీసుకో!" అను. లేకపోతే "ఏమి టయ్యా తొందర! పంటలు రానీ అణా పైసలతో లెక్క జూచి ఇచ్చేస్తాను"-అను. అక్కడున్న వాళ్ళు వింటారని భయం పెట్టుకోకు.

ఈ గడువు అడగడములో ఒక చమత్కారం ఉన్నది. పది నెలలకు ఇస్తాననీ ఆరు నెలలకు ఇస్తాననీ ఎప్పుడూ అనబోకు. ఆరు నెలలు అనే సరికి వాడి గుండెలు అదురుతవి. అల్లాగ బెదర గొట్టడము వలన చాలా ఇబ్బందులు ఉన్నవి. "ఆరు నెలలు ఎవరు ఆగు తారు ఇప్పుడు ఇస్తావా చస్తావా" అని కూర్చుంటాడు.

అట్లా అనడ మొదుకూ, వారం రోజులలో ఇస్తానను. వారం రోజులలో ఇస్తానంటూ ఉంటే ఎవ్వరూ తొందర పడరు.

వారం గడిచిన తరువాత ఏం చెప్పాలె అని గదా నీ సందేహం, ఏమి చెప్పవలసిందీ ఈ వారం రోజులూ ఆలోచించవచ్చు గదా.

అదీగాక ఈ వారం రోజులూ గడిచిన తరువాతనే ఆలోచించుకోవచ్చు! ఈ వారం రోజులలో ఏమి జరుగుతుందో ఎవరు చెప్పగలరు? భవిష్యత్తులో ఏమి జరుగనున్నదీ ఎవ్వరూ చెప్పలేరుగదా. ఇప్పుడు తరచుగా రైళ్లు పడిపోతున్నవి. అకాల మరణాలు కూడా ఎక్కువగానే ఉన్నవి. ఈ వారం జరుగనియ్యి. దాని తరువాత ఆలోచించవచ్చు.

నీ ప్రార్థనలు భగవంతుడు వినకపోవడము వలన ఆయన మళ్లీ కనబడి అడిగితే ఇంకొక వారం వ్యవధి కోరు. బోదన్ నుంచి ఆసాములు సొమ్ము తెచ్చి ఇయ్యడము ఆలస్యం చేస్తున్నారనే నెపము నీకు ఉండనే ఉండె! కాకపోతే మొన్న జనగామ వద్ద నదిలో పడిపోయి మరణించిన వాళ్ళలో నీ ఆసామిని కూడా చేర్చెయ్యి తీరిపోతుంది! దైవికంగా వచ్చిన ఆపత్తుకు ఈతడు మాత్రము ఏమి చేయగలడు.!

అది కాకపోతే ఇల్లా అను: "నీవు తొందర పడబోకు స్వామీ! రేపు సోమవారం కోయంబత్తూరు

ఈ పద్ధతులూ ఇంకా నీకు తోచిన ఇతరములైన పద్ధతులూ అవలంబించి ఎంతకాలం తోసి వేయ గలిగితే అంతకాలం తోసివేసి తప్పించుకొని తిరగాలి. ఈ విష యంలో మార్గేతరములను గూర్చి నేను ఎక్కువగా చెప్ప వలసిన అవసరము లేదు. ఎందుకంటే అనుభవము మీాద నీకే తెలుస్తవి ఈ మెళకువలన్నీ.

ఇలాగ కొన్నాళ్లు గడిచిపోతవి. కాలం గడిచిన కొద్దీ అప్పు ఇచ్చినవాళ్లు, నిన్ను కలుసుకొని అడగ టానికి చేసిన ప్రయత్నాలు విఫలమైపోగా విసుగెత్తి, ఆ ప్రయత్నాలను విరమిస్తారు. ఆ విధంగా కొన్ని అప్పులు ఈ స్టేజి లోనే తీరిపోతవి.

కొంచెం పెద్ద మొత్తం ఇచ్చినవాళ్ళు, ఆ స్థితిలో విరమించుకోక, వెంటబడి కనపడినప్పుడల్లా అడుగు తుంటారు అప్పుడు తప్పించుకు తిరగడము అనే ప్రకర ణము మాని ఇంకో పద్ధతిలోకి మనము దిగవలసి ఉంటుంది. ఆ విధానాన్ని తరువాత ప్రకరణలో వివ రిస్తాను.

## 7. ఋణదాతను రైలెక్కించటం

అప్పులు తీర్చేపద్ధతులలో రెండో విధానాన్ని గురించి ఈ ప్రకరణంలో చెపుతాను.

ఋణదాతను తప్పించుకు తిరగడము మొదటి మార్గము అని చెప్పినాను. మరీ వెంటబడి తిరిగేవాళ్ల

విషయంలో ఇప్పుడు చెప్పబోయే పద్ధతి అనుసరించ వలసి ఉంటుంది.

అటువంటివాళ్ళతో ఇల్లా అనాలి: "ఏమిటయ్యా, ఎక్కడబడితే అక్కడ పట్టుకొని అడుగుతావు. సమయం అసమయం అంటూ లేదా ఏమిటి? తొందరపడితే మటుకు ఎక్కడనుంచి అయినా పుట్టుకొస్తుందా సామ్మ! నాకు ఇవ్వాలిసిన వాళ్ళు ఇయ్యాలా! నా చేతిలోకి డబ్బు రావడంతోనే ముందు నీ కిచ్చి మరో విషయం చూచుకొంటాను. సరేనా! ఇంకేమయ్యా! ఇంకా నీకు భయమెందుకూ!" ముందు మనకే ఇస్తానన్నాడు కదా అని ఆయన సంతోషిస్తాడు.

ఈ విధంగా దబాయింపులో మనిషిని అదర గొడుతూ, కొంతకాలం గడపవలసి ఉంటుంది. అప్పటికీ వదలక విసుగు లేకుండా అడుగుతూఉంటే, వాళ్ళను కొంచెం కఠినంగా కోప్పడవలసిన అవసరము నీకు కలుగు తుంది.

ఆ స్థితి వచ్చిన తరువాత ఆ మనిషి కనపడడము తోనే నీవే ముందుగా కస్సుమంటూ లేచి, భయంకర మైన చూపులు చూస్తూ, "ఛా, ఏ పాడుఘడియలో నిద్ర లేచినానో కాని, ఎక్కడికి వెళ్ళినా ఏదో దరిద్రపు మొఖం కనబడుతూనే ఉంటుంది" అని అన్యాపదేశంగా అను, ఆ మనిషిని చూస్తూ.

అప్పటికీ గ్రహింపు లేక అతడు అడిగినాడో భగ్గున మండిపడి, ఎవరిమీదనో ఎందుకో కోపం వచ్చిన వాడిలాగ నటించవలె.

అంటే నీకు ఇవ్వవలసిన వాడు ఎవడో ఇస్తానని ఇవ్వనట్లూ, అతనివలననే నీకు ఇంత అప్రదిష్ఠ వచ్చి నట్లూ వెల్లడిచేస్తూ, ఎక్కడో ఉన్న ఆ వ్యక్తిని పట్టు కొని నానా మాటలు అను.

"అవునయ్యా, నీ తప్పేముంది. నీకు ఇవ్వాలి కాబట్టి అడుగుతావు. నేను, నాకు ఇవ్వవలసిన వాళ్ళను ఈ విధంగా అడగలేనాయె చచ్చి! అందుకనే నాగతి యిట్లా అయింది. నాకివ్వాలసిన గాడిదలు... ఇచ్చి చావరాయె! ప్రతి వెధవకూ చులకనైపోతిని"

ఈ విధంగా ఎగిరిపడితే ఆ కేకలు విని, భయపడి, ఆ ఋణదాత వెళ్ళిపోవడము సహజము. ఇల్లాగ ఎగిరి పడి కసరికొట్టి ఋణదాతలను వదిలించుకోవడం అప్పులు తీర్చే మార్గాలలో మూడవదని గ్రహించ వలయును.

ఇక ఋణదాతలను కోర్టుకు వెళ్లే లాగున చేయడము న్యాయంగా అప్పుతీర్చే మార్గాలలో నాల్గ వది అని గ్రహించవలసి ఉన్నది. ఇంత వ్యవహారం జరిగిన తరువాత పెద్దమొత్తాలు అప్పు ఇచ్చినవాళ్ళు కోర్టుకు వెడతారు. అంతకంటే ఇంకో మార్గము లేదు వాళ్ళకు.

వాళ్ళు కోర్టుకు వెడతారని నీవు ఏమీ భయపడకు. సమనులు వచ్చినా చూడకుండా విసిరి పారెయ్యి. కోర్టుకు వెళ్ళిందాకా నీకేం కర్మం! నీవు అసలు వెళ్ళనే వద్దు.

నీవు కోర్టుకు వెళ్ళకపోతే ఎక్సుపార్టీ డిక్రీ అవుతుంది. అయితే కానియ్యి. నీకువచ్చిన ఇబ్బంది ఏముంది !

డిక్రీ అయిందో ఇక నీవు బ్రతికి బైట పడ్డట్లే! డిక్రీ అయిన తరువాత నీవు ధైర్యంగా అన్ని వీధుల లోనూ తల ఎత్తుకొని తిరుగవచ్చు. ఎందుకంటే వాడు నిన్ను ఇక ఏ ముఖం పెట్టుకొని అడుగుతాడు! అసలు అడగవలసిన అవసరం ఏముంది! పోతే ఆస్తి మీదకు పోవాలె. అంతేగా! పోనియ్యి.

"పోవయ్యా, డిక్రీ పొందావుగా! ఆ బోదన్ పొలాలు జప్తు చేయించుకో." అని నీవే అంటూ ఉండు. ఆ బోదన్ పోవడము సాధారణంగా జరగదు. పోయినా అక్కడ మనకు ఏమీ లేదన్న సంగతి తెలియడానికి చాలా కాలము పడుతుంది.

ఒకరు డిక్రీ పొందినట్టు తెలియడము తోనే అందరూ కోర్టుకు ఎక్కుతారు. అదే మనకు క్షేమం. అందరినీ ఒకేసారి నైజాం రైలు ఎక్కించవచ్చు. వాళ్లు రైలు ఎక్కుతున్నపుడు నీ పొలాలు అన్యాయంగా

కా జేయడానికి వాళ్ళంతా వెడుతున్నట్లు కొంచెంగా బాధ పడు.

అయితే నువ్వు, వాళ్ళతో మర్యాదగా మాట్లాడి ఎక్కడ రైలు మారాలిసిందీ. ఏ హోటలులో బసచేస్తే సౌఖ్యంగా ఉండేదీ అన్నీ వివరంగా చెప్పి అనివార్యమైన విపత్తును ధైర్యంతోనూ ఉత్సాహంతోనూ ఎదుర్కొంటున్న వాడి లాగ నటించు.

దానితో నీ అప్పులన్నీ సక్రమమైన మార్గంలో తీరినట్లు నీవు భావించవచ్చు.

ఆ తరువాత ఆ వూళ్లో ఉండవలసిన అవసరమూ లేదు ప్రయోజనమూ లేదు. కావలసిన పని అంతా అయిపోయింది. తరువాత ఎక్కడికైనా వెళ్ళిపోవడము విషయమై గట్టిగా ఆలోచించు. మద్రాసు మన రాష్ట్రం కాదు కాబట్టి అక్కడకు వెళ్ళడము అన్నివిధాలా మంచిది. ఇప్పుడు అక్కడ ఇళ్లు చౌకగా కూడా దొరుకుతున్నవి.

ఈ అప్పుల మూలంగా లభించిన సొమ్ము మాత్రం జాగ్రత్తగా దాచిపెట్టుకో. ఆడదాని సొమ్ము జోలికి ఎవ్వరూ పోరు కాబట్టి మీ యింటి ఆవిడకు నాలుగు సరుకులు చేయించి పారెయ్యి, శాశ్వతంగా ఉంటవి.

ఇంతవరకూ పెద్దపెద్ద మొత్తాలు అప్పుగా తెచ్చే విధానాలూ, అవి తీర్చడానికి అవలంబింప వలసిన

మార్గాలూ వివరించాను. తరువాత ప్రకరణంలో చిన్న మొత్తాలు అప్పులుగా తెచ్చే విధానములను గురించీ అవి తీర్చడానికి అవలంబింప వలసిన మార్గాలనుగురించీ కొన్ని రహస్యాలు చెప్పదలచుకొన్నాను.

## 7. చిన్న అప్పుల పైసలా

కొద్ది జీతగాళ్లు, అనగా యాభయ్యో, అరవయ్యో జీతం పుచ్చుకొనేవాళ్లు, పైన సూచించిన విధంగా పెద్ద పెద్ద అప్పులు పుట్టించ లేరు. అటువంటి వాళ్ళు ఎల్లాగ బ్రతకవలె నన్నది ప్రకృత విషయము. వాళ్ళు సుఖంగా బ్రతకవలె నంటే కొన్ని అప్పులు చేయకా తప్పదు, వాటిని న్యాయంగా తీర్చకా తప్పదు. ఆ విషయాన్ని గురించే ఈ ప్రకరణంలో ముచ్చటిస్తాను.

చిన్న అప్పులు చేసే వాళ్లు కూడా పెద్ద అప్పులు చేసే వాళ్ళు అవలంబించిన పద్ధతులనే అవలంబించ వలసి ఉంటుంది. దండయాత్ర సాగించే పద్ధతులు కూడా అవే!

ఈ రకం మనుష్యులు పదీ ఇరవై అప్పు పుచ్చుకొంటూ ఉంటారు. ఇక్కడ కూడా ఓ చిన్న ధర్మ సూత్రం ఉన్నది. పది రూపాయలు అప్పు కావలసి వస్తే యాభై అడగడము మంచిది. అంత పెద్ద మొత్తం అడిగిన తరువాత, నీకు పదో పదిహేనో విదిల్చి నిన్ను వదలించు

కొనడము అతనికీ సంతోషంగా ఉంటుంది. ఎట్లాగయు తేనేం అవతలవాడు నీకు సంతోషంగా అప్పు ఇయ్య డమే నీకు కావలసింది! ఆ కాస్తా చేతిలో వేసుకొని నీవు చక్కా పోవచ్చు.

* చిన్న మొత్తాలు తెచ్చే విషయంలో కూడా పదిమంది దగ్గర అయిదు చొప్పున తెచ్చేకంటే ఒకరి దగ్గరే యాభై తేవడము తెలివైన పని. ఒకవేళ ఆ అప్పు తీర్చలేక పోవడము సంభవిస్తే నీవు ఒక్కడికే ఎగ గొట్టిన వాడవు అవుతావు! అందరికీ అప్పులు ఎగగొట్టి నాడని అనిపించుకోవడము భరింపరాని అపకీర్తి. సంసార పక్షంలో ఒకరికో ఇద్దరికో ఎగగొట్టడము ఎక్కడైనా ఉంది! ఆ విషయాన్ని ఎవరూ విపరీతంగా చూడరు.

ఇల్లాగ చిన్న చిన్న బదుళ్లు తెచ్చేటప్పుడు పొరుగూరులో ఉన్న వాళ్ళ దగ్గర నుంచీ దూరపు పేట లలో ఉండేవాళ్ళ దగ్గర నుంచీ మాత్రమే చిన్న చిన్న పెద్ద మొత్తాలు, అంటే పది, ఇరవై, యాభై తెస్తూ ఉండు. ఇందులో లాభం ఏమిటీ అంటే ఆ పదీ వసూలు చేసుకొంటానికి ఆ పెద్దమనిషి నాలుగైదుమైళ్లు నడిచి రావడానికి బద్ధకిస్తాడు. ఊళ్లో వాళ్ళ దగ్గర ఒకొక్కళ్ళ దగ్గర అయిదేసి కంటె ఎక్కువ పుచ్చుకొనక పోవడమే

* భ. కా. అభిప్రాయ భేదం

మంచిది. పెద్దపెద్ద మొత్తాలు అప్పుగా తేవడానికి ఏయే పద్ధతులు అవలంబించినామో ఈ చిన్న మొత్తాలు తేవడానికికూడా అవే పద్ధతులు పనికివస్తవి.

ఇక ఈ చిన్నచిన్న చేబదుళ్లు తీర్చుటకు కూడా ఆ పద్ధతులే బాగా పనికివస్తవి. అప్పు ఇచ్చిన వాడికి కనుపించకుండా తిరుగుట అనే పద్ధతి ఒకటుంది అని చెప్పినాను. దానికి "రుక్మిణీనాధీయము" అని పేరు. ఆ పద్ధతి వలననే ఒక ఆరు నెలలలో చాలా చిన్న చిన్న అప్పులు తీరిపోతవి.

ఈ విషయంలో నేను ఇంత చెపుతున్నా ఇంకా ఏవో సందేహాలు పెట్టుకొని కూర్చోనడం అనవసరం. ఆ పద్ధతివలన మా శాస్త్రి ఏమిటి నేనేమిటి, ఇంకా ఎంతోమందిమి చిల్లర అప్పులు సాపుగా తీర్చివేసి నాము. మమ్ములను నమ్మవలసిందని కోరుతున్నాను.

పోతే పొరుగూరు వాళ్ళ సంగతి. నీకు అప్పుగా ఇచ్చిన పాతికా పరకా మళ్ళా వసూలు చేసుకుందామని వాళ్ళు పని గట్టుక వచ్చి అడుగరు. కనపడ్డపుడు అడుగు దాము అనుకొంటారు. నీవు వాళ్ళకు కనపడవు కాబట్టి ఇక భయములేదు.

అయితే ఒకప్పుడు వాళ్ళు నీకు ఈ విషయమై జ్ఞాపకం చేస్తూ కబురు చేస్తారు ఆ కబురు తెచ్చిన వాడితో "రేపు ఫస్టు తారీఖున జీతం రావడముతోనే

తెచ్చి ఇస్తాను. ఇంకా ఆలస్యం చేస్తానుటయ్యా! ఛా! ఛా! వెధవది పది రూపాయలు తీసుకొని ఇంత కాలం గడపడము నాకూ సిగ్గుగానే ఉన్నది" అని మంచిమాటలు చెప్పి అతనిని పంపివేసెయ్యి.

జ్ఞాపకం పెట్టుకొని సరిగ్గా నెల ఆఖరుకు అతడు రాడు, ఒకరోజు ముందుగా వస్తే. "ముందుగా వస్తే నా దగ్గర డబ్బు ఎక్కడుంటుందయ్యా? ఫస్టు తారీఖునే వస్తుంది. ఈ లోపున నీవు ఎన్నిసార్లు తిరిగినా లాభం లేదు" అను. కాస్త ఆలస్యంగా వస్తే ఏమనవలెనూ అంటే "ఏమయ్యా ఫస్టున రాకపోతివి! ఆ పదిరూపాయలూ ముడుపుగట్టి పెట్టె అడుగున పారేశాను. నిన్నటి దాకా ఆ ముడుపు ముడుపుగానే ఉన్నది. నిన్ననే ఆ పొట్లం తీసి ఏదో అవసరానికి వాడేశాను. సామాన్య సంసారాలు కావు బాబూ! ఏదో అవసరం వస్తుంది. ఇక ఎందుకూ ఈ నెల ఆఖరుకు తప్పకుండా ఇచ్చివేస్తాను. ఇక ఆలస్యం చేయను బాబూ" అను.

సరిగ్గా ఫస్టుతారీఖుకు వస్తాడూ ఆ ఆసామి! రాలేదు. మళ్ళీ ఆలస్యంగానే వస్తాడు. వచ్చి రావడముతోనే, నీవే అతనిమీద విరుచుకపడి, "ఏమిటయ్యా! రమ్మన్నపుడు వస్తే ఇచ్చేసే వాణ్ణి. నీ ఇష్టం వచ్చినపుడు వచ్చి గొంతుక మీద కూర్చుంటే, ఎక్కడ నుంచి వస్తుందయ్యా డబ్బు!" అని కోపంగా అరువు.

ముందుగా నీవే కోపంగా విరుచుక పడడం వలన ఆ వచ్చిన వాడు తనదే తప్పు అని అనుకొని నోరు మూసికొని, వచ్చిన దారినే వెళ్లిపోతాడు.

ఈ కోప్పడడము కూడా ఒక ధర్మాన్ని అనుసరించి నడుస్తుందని జ్ఞాపకం ఉంచుకో. ఏమిటీ అంటే, ఆ అరవడములో గొంతు యొక్క స్థాయి పక్క వాయిద్యానికి అనుగుణంగా ఉండాలె. ఎదుట మనిషి కొంచెం మెత్తపడితే నీవు గొంతు పెద్దది చేసి షడ్జమంలో పాడవచ్చు. లేకపోతే మందరం లోనే సాగనియ్యి.

ఇంకొక ధర్మ రహస్యం కూడా ఉన్నది. అతడు కోపంతో మాట్లాడితే నీవు కాస్త తగ్గు. అది లొంగిపోవడము ఎంతమాత్రమూ కాదు. ప్లాను ప్రకారం వెనక్కు తప్పుకోవడము అంటారు. అదను తప్పివస్తే అణగి మణగి ఉండడము నేర్పూ వివేకమూ అవుతుంది గాని మరొకటీ మరొకటీ కానేరదు.

అవతల పెద్దమనిషి కాసేపు అరచి అరచి నోరు నొప్పి పెట్టి ఊరుకుంటాడు. ఊరుకోక ఏమిచేస్తాడు! అతడు ఊరుకొన్న తరువాత నీవు నోరు పెద్దది చేసినా ఫరవాలేదు.

ఇంకొక పద్ధతి ఏమిటీ అంటే అప్పు ఇచ్చిన పెద్దమనిషి కనబడటముతోనే, అతను ఇంకా పెదవి విప్పక పూర్వమే .నీవు నీ పాద ప్రారంభించి ఇంట్లో పిల్లలకు

జ్వారాలు రావడమూ, అప్పుడే ఎవరో బంధువులు వచ్చి కూర్చోనడమూ మొదలైన విషయాలను గురించి పెద్ద పెట్టున అంగలారుస్తూ అవతలవాడికి ఊపిరి ఆడకుండా గోలపెట్టు. నీ కష్టాలన్నీ విన్న తరువాత కూడా ఆ వెధవ పదిరూపాయలు ఇస్తే గాని వీల్లేదని అనడు ఎంత కఠిన హృదయుడైనా!

ఇల్లాగ అడిగి అడిగి విసుగుపుట్టి "ఛా! పోతే పోయిన్నై లే, వెధవ పదిరూపాయలు, దీనికోసం పని మానుకొని ఎవరు తిరుగుతారు ఆయన చుట్టూ, అని అనుకొని ఊరుకొంటాడు ఆ అప్పు ఇచ్చిన పెద్దమనిషి. దానితో ఆ అప్పు న్యాయంగా తీర్చబడినట్టు నీవు భావించవచ్చు.

అల్లాగ భావించి ఆ విషయమై మరిచి పోవడము ఎంత అయినా అవసరము. జ్ఞాపకం ఉంచుకొంటే అదో రకమైన బాధ కలుగుతుంది. ఆ విషయము కుసుపులాగ సలుపుతూ ఉంటుంది. అందుకని నీకు ఆ విషయము పూర్తిగా జ్ఞాపకం లేకుండా పోవడము అవసరము. ఎప్పుడైతే ఆ విషయమై పూర్తిగా మరచిపోగలుగుతావో అప్పుడు నీ అప్పు అణాపైసలతో తీరిందన్నమాట! ఈ మరచిపోయే శక్తిని భగవంతుడు నీకు ఇందుకే ఇచ్చినాడు అని తెలుసుకో! అప్పులు తీర్చే మార్గాలలో మరచిపోవడము చాలా ఉత్తమమైనటువంటిదిన్నీ

ప్రధానమైనటువంటిదిసీన్ని అన్న సంగతి ఎప్పుడూ మర వకు.

అప్పులు ఇచ్చిన ఆసామి నీవు పెద్దగా అరిచి గోల చేసినపుడు ఊరుకొన్నా, మళ్ళీ నీవు కనపడినపుడు ఈ విషయమై ఎత్తే అవకాశం ఉన్నది. అందుకని మళ్ళీ అతని ఎదుట పడకుండా తప్పించుకు తిరుగు.

అంతే కాకుండా ఆ క్షణం నుంచి అతణ్ణి పరమ విరోధిలాగ చూడు. అప్పు ఇచ్చినవాడు ఇచ్చినట్లు ఊరుకోక ఎప్పుడైతే మళ్ళీ నిన్ను అడిగినాడో ఆ క్షణాన్నుంచీ, వాడు నీకు గర్భశత్రువు అని తెలుసుకో. నాయనా! దుష్టుడికి దూరంగా ఉండడము మంచిది కాబట్టి నీవు అతనికి కనపడనేవద్దు. ఒకవేళ కర్మంజాలక కనపడితే అతనివంక కొరకొరా జూచి, కళ్ళలో నిప్పులు కురిసించి, పాములాగ బుసలుకొట్టి, సింహములాగు గుట్టు పెట్టి, మాట్లాడి స్తే చంపుతాడురా బాబో అని అనుకొనే లాగున ప్రవర్తించాలె. ఒకవేళ మాట్లాడి స్తే, కస్సు మను, బుస్సుమను, ఏదో విధంగా అతనిని బెదరగొట్ట డమే మనకు కావలసింది.

ఈ ప్రకరణము చాలాబాగా పనిచేసింది. చాలా మంది ఈపద్ధతి వలన ఋణబాధనుండి విముక్తులైనారు.

అయితే కొంతమంది మొండివాళ్లు ఈ బెదరింపు లకు లొంగక వెంటబడి అడిగితే అప్పుడు ప్రకరణం

మార్చ వలసి ఉంటుంది. అప్పుడు ఏమనాలంటే, "ఏమి టయ్యా వెధవ పది రూపాయల కోసం తెగ తిరుగు తున్నావు. ఇవ్వాళ ఆదివారం బ్యాంకికి సెలవు. రేపు తీసి ఉంచుతాను. ఎల్లుండి ప్రొద్దున్నే ఆరు గంటలకు వచ్చి తీసుకు పో" అను. అప్పటికి ఆ పీడ వదులుతుంది. ఎల్లుండి ఉదయము, ఎట్లాగూ నీవు ఇంట్లో ఉండవు. తెల్లవారు ఝామున నాల్గు గంటల బండికే నీవు బెజ వాడ వెళ్లావని మీవాళ్ళు వచ్చినవాళ్ళతో చెపుతారు. ఆ సంగతి నీవు నేర్పే ఉంచినావుగా! ఇక భయమెం దుకు? ఆ విధంగా పదిసార్లు తిరిగి విసుగు పుట్టి వాడే ఊరుకొంటాడు. ఈ విధంగానూ తీర్చి పారెయ్యవచ్చు మన బాకీలను. బాకీ తీరడమే మనకు కావలిసింది. ఎట్లా తీరితేనేమి?

ఇంకొక పద్ధతిలో కూడా బాకీలు తీర్చవచ్చు. "చూడండి, మిమ్మల్లను తిప్పడము ఏమీ మర్యాదగా లేదు. మీ ఊళ్ళో గొర్రెపాటి సుబ్బయ్యగారు ఉన్నారు ఎరుగుదురుగా? ఆయనకు ఒక ఉత్తరం ఇస్తాను. తీసికొని వెళ్ళి ఆయనకు ఇయ్యండి. వెంటనే మీకు డబ్బు ఇచ్చే స్తారు" అను.

ఆ సుబ్బయ్యగారు పెద్దమనిషి అని అందరికీ తెలుసు. అందుకని ఉత్తరం పుచ్చుకొని ఆ ఆసామి సంతోషంగా వెళ్ళిపోతాడు. ఆ సుబ్బయ్యగారు వట్టి అమాయకుడు. నీకు కాస్త తెలిసినవాడైతే ఇవ్వనూ

ఇస్తాడు. ఇవ్వక "ఈయన ఎవరో నాకు తెలియదు" అంటాడూ; అనసీ. ఆ ఆసామీ మళ్ళా వచ్చినపుడు చూచుకొందాము. సాధారణంగా రాడు. పోనీలే వెధవ బాకీ అనుకొంటాడు. అప్పులు తీర్చడానికి ఇదొక మార్గము మటుకు అవును. దీనికి "జంకిన్ సన్ మెథడ్" అని పేరు. ఎందుకు వచ్చిందంటే ఆ పేరు "గోల్డుస్మిత్" వ్రాసిన "వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు"లో "జంకిన్ సన్" అనే వేదాంతి, "డాక్టరు ప్రిమ్‌రోజు" కు తాను బాకీపడిన మొత్తమును ఈ పద్ధతిలో తీర్చివేస్తాడు.

నీవు అల్లాగ వాళ్ళ ఊళ్లో పెద్దమనిషికి ఉత్తరం ఇచ్చి పంపిన తరవాత ఓపని చెయ్యాలె. ఆ పదిరూపాయలూ రెండుసార్లు రెండు అయిదులు ఇచ్చేసినట్టూ, ఆయనకు ఆ విషయం జ్ఞాపకం లేక మళ్ళా మళ్ళా అడిగి నిన్ను అల్లరి పెడుతూ ఉన్నట్లూ అందరితోనూ చెప్పుకొని గోలపెట్టవలె. ఆ తరువాత అతడు చప్పబడి ఊరుకొంటాడు.

ఈ చేబదుళ్ళు ఇచ్చిన వాళ్ళు నిన్నేమీ చేయలేరు. అందుకని నీవు ధైర్యంగా ఉండవచ్చు. కొన్నాళ్లు అయినతరువాత అంతా ఆయన్నే తిడతారు వాడికిఅప్పు ఎందుకు ఇచ్చావయ్యా అని! అప్పుఇచ్చినందుకు విచారపడవలసింది ఆయన. తెచ్చుకొన్నవాడివి నీకేం బెంగ?

అప్పు ఇచ్చిన ఆసామి ఎక్కువగా కేకలేస్తే నీవు ఏ మాత్రమూ భయపడకు. అరిచే కుక్కలు కరువవు అన్న సామెత జ్ఞాపకం తెచ్చుకో.

ఎవరైనా ఇంటిముందు నిలువబడి పెద్దగా కేకలేస్తున్నపుడు నీవు లోపల గడియ పెట్టుకొని మంచంపై పడుకొని దుప్పటి కప్పుకొనడము ఒక పద్ధతి. చూచిన వాళ్ళు ఎంత శాంత మూర్తిరా అని సన్నె మెచ్చుకొంటారు.

లేకపోతే, ఆ ఆసామి వెళ్ళిపోయిన తరువాత నీవు బైటికివచ్చి అతడు తిడుతున్నప్పుడు, నీవు ఇంట్లో లేనట్లూనీవు ఇంట్లో లేనపుడు అతడు ఏదో అని పోయినట్లూ నటించడము రెండో పద్ధతి. ఈ రెండో పద్ధతే అన్నివిధాల ఉత్తమమైనదని నా అభిప్రాయము.

అప్పుడు నీవు బయటికి వచ్చి ఏ విధంగా చెప్పవలసి ఉంటుందో తెలుసా ? చాలామందికి ఈ విషయం తెలియక "ఏదో పది రూపాయలు ఇవ్వాలె ఆయనకు ! దానికోసం ఇంత గోల చేస్తున్నాడు" అని నిజం చెప్పేస్తారు. అల్లాగ చెపితే నీ గౌరవము ఏమైనా ఉంటుందా! నీ ప్రతిష్ఠ ఆ రోజుతో గంగలో కలిసినట్లే కదా? ఛా! ఛా! అల్లాగ చెప్పకూడదు. ఏమని చెప్పవలెనూఅంటే:

"ఏమీలేదండీ, ఆ సూరయ్య లేడూ వాడికీ... పదిరూపాయలు కావలసివచ్చింది. పాపం, పిల్లా జెల్లా

కలవాడు. పెళ్ళాం ఆసుపత్రిలో ఉన్నది. అటువంటి ఇబ్బందులలో ఉండి పదిరూపాయలు అప్పు అడిగాడు. సమయానికి నాదగ్గర చిల్లరలేకపోయింది. ఈ పెద్దమనిషి అక్కడే వుంటే, 'పోనీ నీవు ఈయవయ్యా, బీదముండా కొడుకు. ఆపదలో ఉన్నాడు' అన్నాను. ఇచ్చాడు. ఆ సూరయ్య ఉన్నవాడా ఏమన్నానా! అదుగో ఇస్తాను ఇదిగో ఇస్తాను అని కాలం గడిపేస్తున్నాడు.

"ఈ పెద్దమనిషి. నీవు 'ఇయ్యి'మంటే ఇచ్చాను. నీ ముఖం చూచి ఇచ్చానుగాని వాడి ముఖం చూచి ఇచ్చానా! ఆ పదీ నీవు ఇయ్యి' అంటాడు.

"వాడి దగ్గర వసూలు చేసి ఇస్తానయ్యా అంటే వినడే! బహు తొందర మనిషి. ఆ పదీ నేను ఇయ్య లేక కాదు. కావాలంటే ఇప్పుడు ఈ క్షణంలో విసురు పుచ్చుకొని ముఖాన పారెయ్యగలను. కాని అది వ్యవహారమా చెప్పు?

"వాడివ్వకపోతే నేను ఇస్తానయ్యా అంటే వినక ఇంటి మీదకొచ్చి నేను లేనిసమయంలో అల్లాగ కేకలేస్తాడు, ఇదేమైనా పెద్దమనిషి తనమేనా!

"చూచావా, రత్తయ్య బావా ఇల్లాగ ఉన్నది ప్రపంచం! మంచికి కాలం కాదయ్యా! వాడేదో ఆపదలో ఉన్నాడని నేను దయ దలచి ఇప్పించాను గదా ఆ సంగతి అర్థం చేసుకోవద్దటయ్యా ఈ పెద్ద మనిషి మటుకు!

"ఎంత అప్రదిష్ట! పోనీ పారేద్దామా అంటే ఎంత మందికని ఇయ్యగలమయ్యా బావా నీవే చెప్పు. మొన్న ఆ నాగిగాడికి ఏదో గండ కత్తెర వస్తే ఇరవై రూపాయలు ఇయ్యడము నీవు ఎఱుగుదువుగదా! * గొల్ల సీతమ్మకు నిన్న నేగా అయిదురూపాయలు ఇచ్చింది! ఏమంటావు? ఇల్లాగ ఎంతమందికని ఇయ్యగలమయ్యా! ఏదో ఉన్నదిగదాఅని పారేసుకోంటామా? ఏమంటావుబావా! మా ఆవిడ గోల పెడుతూనే ఉన్నది 'అందరి సంగతి నెత్తినేసుకోకండీ' అని! నేనే వినలేదు". ఇల్లాగ కథలాగ చెప్పెసెయ్యి.

ఇందులో నేర్పు ఎక్కడ ఉన్నదీ అంటే ఆ సూరయ్యకు నీవు పది రూపాయలూ ఇప్పించినట్లు చెప్పినా ఆ సూరయ్య ఎవరో చస్తే చెప్పకూడదు. అంతగా అడిగితే "ఉన్నాడు లేవయ్యా చింత గుంట పాలెంలో. వాడి బ్రతకు బైట పెట్టడము ఎందుకూ !" అను.

నీవు ఎంతో కరుణార్ద్ర హృదయుడవు అయి నట్లూ, ఎంతమందికో ఆపద సమయంలో ఇల్లాగ అడ్డు

---

* నిజానికి ఆ రత్తయ్యకు నీవు ఇరవై ఇచ్చినసంగతి తెలియదు. నీకే తెలియదాయె ఈ క్షణమువరకూ; అయినా నీకు తెలుసుగా బావా అంటే, ఏబ్బే నాకేం తెలియదు అని అవతల పెద్ద మనిషి చటుక్కున అనడు. మాట్లాడక ఊరుకోంటాడు. ఇల్లాగ నీకు తెలియందేమిటి బావా అనడము మాట నేర్పు.

పడుతూ ఉండడము నీ స్వభావము అయినట్లూ, ఊళ్ళో ఎవరికి ఎవరు అప్పు ఇచ్చినా నీ ముఖం జూసే ఇస్తూ ఉన్నట్లూ వినేవాళ్ళు అనుకొనే లాగున చెయ్యడంలో నీ వాగ్వైదుష్యము ప్రదర్శింప వలసి ఉంటుంది.

ఇంతకు ముందే గొల్ల సీతమ్మకూ, చాకలి నాగులుకూ ఒకటీ, అరా, ఆపద సమయంలో ఇచ్చి ఇల్లాంటి కీర్తి సంపాదించి పెట్టుకోవడము కూడా అవస రమూ అన్న సంగతి నీవు ఈ పాటికి గ్రహించే ఉంటావు !

ఒక్క విషయం చూడు. ఆ గొల్ల సీతమ్మకూ వాళ్ళకూ నీవు సాహాయము చేసి ఉండడము నిజమే అవతలి వాళ్ళకు తెలిసి ఉంటే నీవు చెప్పిన కథ అంతా నిజమై కూర్చుంటుంది.

జీవితంలో, మానవ సాంఘిక వ్యాపారాలలో ఇది ఒకొక పరమ రహస్యం. ఏమిటీ అంటే, కాసిని పాలు తీసుకొని ఆ పాలలో నీళ్ళు కలిపి అన్నీ పాలేనని డబాయించ వచ్చుగాని, వట్టి నీళ్ళలో ఇంకా కాసిని నీళ్లు కలిపి అవన్నీ పాలు అని అంటానికి వీలులేదు. అల్లాగే ఒక పాలు సత్యంలో పదిపాళ్ళు అసత్యం కలిపి అంతా సత్యమైనట్లు ప్రచారం చెయ్యడము తెలివైన వాడు చేసే పని. కానిబొత్తిగా అబద్ధాలను నిలబెట్టలేము అన్న సంగతి గుర్తుంచుకో !

ఇంకొక ముఖ్యమైన విషయము చెప్పి ఈ ప్రకరణం ముగిస్తాను. ఇల్లాగ చిల్లర అప్పులు చేసేవాళ్ళు తమవద్ద ఖరీదైన వస్తువులేమీ అట్టి పెట్టుకోకూడదు. బంగారపు ఉంగరాలు, ఖరీదైన ఉత్తరీయాలూ నీవద్ద ఎప్పుడూ ఉండకూడదు. ఒక లావుపాటి చేతికఱ్ఱ పట్టుకొని తిరుగుతూ ఉండడము ఎందుకైనా మంచిది. దానితో ఎప్పుడు ఏమి అవసరము వస్తుందో చెప్పలేము కదా!

ఉన్న ఊళ్ళో ఇల్లాగ చేతనైనంతవరకు అప్పు చేసి, ఇంతవరకూ సూచించిన మార్గముల ననుసరించి వాటిని తీర్చడము జరిగిన తరువాత ఇక ఆ ఊళ్లో ఉండి ప్రయోజనము లేదు. వెంటనే మరో ఊరికి బదిలీ చేయించుకొని ఆ వూళ్లో మొదలు పెట్టి మళ్ళీ ఈ వ్యాపారం సాగించడము ఎంతైనా ఉత్తమము !

## 8. ధర్మసూత్ర నిరూపణ

అప్పుచేసే పద్ధతులను గురించీ సక్రమంగా ఆ అప్పులను తీర్చ వలసిన బాధ్యతను ప్రతివాడూ గుర్తించి ఏ విధంగా తీర్చవలెనో ఆ విషయాన్ని గురించీ సమగ్రంగా పరామర్శచేసినాను. ఇక ఒక్క విషయము చెప్పి ఈ పుస్తకం ముగిస్తాను. ఆ విషయము ఇదివరల్లో చెప్పినదే అయినా అది చాలా ప్రాముఖ్యంగల విషయము కాబట్టి మరొకసారి నొక్కి వక్కాణించదలచు

కొన్నాను. ఏమిటీ అంటే, మనము ఒకరికి ఒక మొత్తము, చిన్నది గాని పెద్దది గాని, బాకీ పడ్డ తరువాత, ఆ బాకీ విషయమై బొత్తిగా మరచి పోవడము వలననే ఆ ఋణము పూర్తిగా తీరిపోతుందన్న ధర్మసూత్రము యొక్క ప్రాముఖ్యమును వివరించు నట్టి రెండు కథలు ఇక్కడ చెప్పదలచినాను. ఆ కథలలోని వ్యక్తులు తమ బాకీల విషయమై వీలువెంట మరచిపోయి ఏ విధంగా ఋణ విముక్తులు అయినారో గుర్తించ వలసి ఉన్నది.

కోర్టులో నుంచి ఒక ముఖ్యమైన కాగితం నీకు కావలసి నీవు తత్ సంబంధమైన గుమాస్తా దగ్గరకు వెడతావు. అతడు ఏమంటాడు ?

"చూడండి మీకు కావలసిన డాక్యుమెంటు నేను ఎల్లాగో కష్టపడి సంపాదించి పెడతానుగాని మీరు నాకొక సహాయం చేయవలె... ఒక యాభై రూపాయలు అత్యవసరంగా కావలసి వచ్చింది. మీరు నాకు ఉచితంగా ఏమీ ఇయ్యనక్కరలేదు సుమండీ ! ఇచ్చినా నేను పుచ్చుకోను ! మళ్లీ మీకు ఆ సొమ్ము వారం పది రోజులలో ఇచ్చివేస్తాను నూటికి ఆరు చొప్పున వడ్డీ ఇయ్యటానికి కూడా అభ్యంతరము ఏమీలేదు. కాస్త చేబదులుగా ఇప్పించండి."

నీకు అతనితో పని ఉన్నది. కాదన లేవు. ఇచ్చి వేస్తావు. ఈ విధంగా ఆ గుమాస్తా నీకు యాభై రూపా

యలు బాకీ పడినాడు. అతడు నీ బాకీ ఏ విధంగా తీరు స్తాడన్నదే మనకు ప్రకృతము కావలసిన విషయము.

ఆ గుమాస్తా ఆ బాకీని ఎట్లా తీరుస్తాడో తెలుసునా? ఆ విషయమై పూర్తిగా మరిచి పోతాడు. దాంతో ఆ బాకీ తీరి పోతుంది.

ఆ డబ్బు ఇయ్యమని నీవు మళ్లీ అడగవు. ఏదో సాహాయ్యము చేసినాడు గదా పోనీలే అని ఊరుకొంటావు. ఆ సంగతి అతనికీ తెలుసు! అందుకనే అతడు ఈ విషయమై చాలా త్వరితముగా మరిచి పోగలుగుతాడు.

ఇంతకూ నేను చెప్ప దలచు కొనిన విషయము ఏమిటీ అంటే, ఎక్కడైతే నీవు చేసిన బాకీ మర్చిపోవడానికి అవకాశము ఉన్నదో, అక్కడల్లా చటుక్కున మరిచి పోవడమే కర్తవ్యము కాని, అంతరాత్మ బాధిస్తుందనీ, మర్యాద కాదనీ ఇటువంటి పిచ్చి పిచ్చి ఊహలకు తావు ఏ మాత్రమూ ఇయ్యకూడదు.

తమ వద్దకు ఏదైనా పని ఉండి వచ్చిన ఆ సామీలతో సాధారణంగా అధికారులు ఇట్లా అంటూ ఉంటారు. "చూడండి, మీ గ్రామములో మంచి కందులు దొరుకుతవి అని విన్నాను. ఒక బస్తా తోలిపెడతారూ? ఆ బండి మనిషికే చీటీ ఇచ్చి పంపండి. ఆ బస్తా కందులకు ఎంత ఇయ్యవలెనో తెలియ జేయండి. డబ్బు వాడి చేతికిచ్చి పంపిస్తాను."

అవతల పెద్దమనిషి "అల్లాగే నండి ప్రమత్తు ఖరీదు ఇవ్వాలటండీ ?" అంటాడు మర్యాదకు.

ఆ మాటలు విని అధికారి కోపం వచ్చిన వాడి లాగ ముఖం పెట్టి, "అల్లా కాదండోయ్. డబ్బు పుచ్చుకోకపోతే నేను ఊరుకోను. ఇక్కడ మంచి కందులు దొరకక మీ ముళ్లను అడుగు తున్నానుగాని కొనుక్కోలేక కాదు. మీ కేమైనా ఊరికే వచ్చినవా! ఒకవేళ మీ పొలంలో పండినవే అనుకోండి, అయితే మటుకు ధర పుచ్చుకోకపోతే నేను ఒప్పుకుంటానా! అదంతా వీలులేదు లెండి. కందులు మటుకు పంపండి. ధర పుచ్చుకోండి." అంటాడు.

దాని తరువాత కందుల బస్తా వస్తుంది. చీటీ కూడా పంపిస్తాడు. అధికారి కందులబస్తా ఇంట్లో వేయించుకొని, "డబ్బు పంపిస్తానన్నానని చెప్పు" అంటాడు.

అంతే. దాని తరువాత ఆ విషయము ఆయనకు జ్ఞాపకం ఉండదు. ఎట్లా జ్ఞాపకం ఉంటుంది; గొప్ప అధికారి ఆయె! ఆ ఆసామి పనిగట్టుకొని వచ్చి అడుగనూ అడుగడు. అడుగడని ఈయనకు తెలియనూ తెలుసు! కాబట్టే ఆ విషయము తొందరగా మరిచి పోవడము సంభవము అవుతుంది.

మళ్లీ ఆ ఆసామి ఆ అధి[illegible]ని కలుసుకొన్నా ఈ కందులబస్తా సంగతి ఎత్తడు. ఈయనా ఎత్తడు. ఆ బాకీ ఎప్పుడో తీరిపోయిందన్న మాట!

అయితే కొందరు గడసరులైన అధికారులుం టారు. వారు ఆ ఆసామి కనుపించినపుడు కొంత సంభాషణ అయిన తరువాత "చూశారా, ఇప్పుడు మిమ్మలను చూస్తే జ్ఞాపకం వచ్చింది! మీకు ఆ కందుల బస్తా ఖరీదు ఇవ్వనే లేదు కామాలు! పోనీ నాకు జ్ఞాపకం లేకపోతే మీరైనా జ్ఞాపకం చెయ్యవద్దుటండీ? నేను ఈ ఆఫీసు పనితో మునగానాం. తేలానాం గా ఉంటాను. చూశారూ, మీరు అల్లాగ ఎప్పుడూ చేయకండేం! ఇదే చెప్పడము! రేపు వచ్చే ఫస్టు తారీఖునకు వచ్చి సొమ్ము అడిగి పట్టుకెళ్ళండి" అంటాడు. దాని తరువాత ఆ విషయం మళ్ళీ మరిచి పోతాడు. మరిచి పోతానని ముందుగానే చెప్పినాడాయె! ఆయన తప్పేముంది ఇందులో!

ఇల్లాగనే కొందరు అధికారులు తమ [illegible] గుమాస్తాలుగా ఉన్న వారి వద్ద అయిదూ పదీ అప్పుగా పుచ్చుకొని మరిచిపోతూ ఉంటారు.

అప్పు జేసిన మొత్తమును తిరిగి ఇచ్చేవాడు అధముడు. ఇస్తానంటూ కాలం గడిపేవాడు మధ్యముడు. అప్పు తెచ్చిన మరుక్షణం లోనే ఆ విషయమును పూర్తిగా మరువ గలిగిన వాడు ఉత్తముడు.